

జటాకటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ
విలోల వీచివల్లరీ విరాజమాన మూర్ధనీ

(రావణ శివస్తోత్రం)

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 7
17-10-56

దుర్ముఖ ఆశ్వయుజ శుద్ధ త్రయోదశి బుధవారం

## ★ విషయానుక్రమణిక ★

# తుంగభద్ర ఎగువ కాలువ

"ఉరుగుగో చిటపట చినుకులు పడుతున్నవి; అంటే వరుణదేవుడు మన కృషిని ఆశీర్వదిస్తున్నాడన్న మాట," అన్నారు, ఆంధ్ర గవర్నర్ శ్రీ త్రివేదీ మొన్న గాంధి జయంతినాడు తుంగభద్ర ఎగువ కాలువ త్రవ్వకానికి ప్రారంభోత్సవం జరుపుతూ. కాలువత్రవ్వకం పనిని సాధ్యమైనంత త్వరలో పూర్తిచేయడానికి వీలుగా ఆంధ్ర మైసూరు ప్రభుత్వాలు పరస్పర సహకారంతో వ్యవహరించాలనీ, కేంద్ర ప్రభుత్వంవద్ద ఎక్కువ సహాయం పొందడానికి ప్రయత్నించాలనీ శ్రీ త్రివేదీ అన్నారు. "కాలువ నిర్మాణానికి ఎక్కువ డబ్బు వ్యయం చేయడం ఎప్పుడైతే ప్రారంభిస్తారో, అప్పటినుంచే రైతులు కాలువ ఫలితాన్ని అనుభవించేటు చూడండి," అనికూడా గవర్నర్ హితవు చెప్పారు. తుంగభద్ర డాం నిర్మాణం పూర్తిఅయ్యేనాటికి కాలువల త్రవ్వకంపని పూర్తిగాక పోవడమే శ్రీ త్రివేదీ ఈవిధంగా సలహా ఇవ్వడానికి కారణమై వుంటుంది. తుంగభద్ర ఎగువకాలువ ఫలితాన్ని రైతులు శీఘ్రమే అనుభవించాలంటే, త్రవ్వకంపని ఒకవైపు జరుగుతూండగానే, దానికింద సాగుకువచ్చేఆయకట్టు భూముల అభివృద్ధికి కూడా మరొకవైపు పూనుకోవాలి.

హాస్పేట తాలూకా మల్లాపురంవద్ద తుంగభద్ర డాం స్థలంలో జరిగిన ఈ ప్రారంభోత్సవానికి మైసూరు ముఖ్యమంత్రి శ్రీ మంజప్ప అధ్యక్షత వహించారు. ఆంధ్ర ముఖ్యమంత్రి, పబ్లిక్ వర్క్స్ మంత్రి, ప్లానింగ్, సహకార, స్థానికపరిపాలన శాఖల మంత్రులు, మైసూరు, హైదరాబాదుల, పబ్లిక్ వర్క్స్ మంత్రులు. ఆంధ్ర చీఫ్ ఇంజనీరు, తుంగభద్ర ప్రాజెక్టు చీఫ్ ఇంజనీరు, తుంగభద్ర ప్రాజెక్టు నిర్వహణ మండలి అధ్యక్షుడు మొదలైనవారు హాజరైనారు.

దాదాపు పదివేలమంది వచ్చి కార్యక్రమాన్ని చూశారంటే, ఈ ఎగువకాలువ కోసం క్షామపీడితులైన స్థానికప్రజలు ఎంత ఆతృతతో నిరీక్షిస్తున్నారో ఊహించవచ్చు.

దక్షిణ భారతదేశంలో నాగార్జున సాగరం తర్వాత తుంగభద్ర ప్రాజెక్టే పెద్దది. నాగార్జున సాగరం నిర్మాణానికి వ్యయం అంచనా 121 కోట్ల రూపాయలైతే, తుంగభద్ర ప్రాజెక్టు ఖర్చు దాదాపు 70 కోట్లు. దీని డాంను నదీగర్భానికి 160 అడుగుల ఎత్తున నిర్మించారు; ఆనకట్ట పొడుగు 6007 అడుగులు. అలుగు పారే చోట ఆనకట్టమీద 20 అడుగుల ఎత్తూ, 60 అడుగుల వెడల్పూ కలిగిన తలుపులు అమర్చారు. రిజర్వాయర్ విస్తీర్ణం 146 చదరపుమైళ్లు; 30 లక్షల 50 వేల ఎకరా అడుగుల నీరు ఈ సరస్సులో చేరుతుంది.

ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలలో కుడివైపున ప్రవహించే దిగువకాలువ పొడవు 247 మైళ్లు; దీనికిచెందిన చిన్నచిన్న పంట కాల్వలన్నీ చేరి మరొక 1721 మైళ్ళు వుంటవి. ఈ కుడికాలువ వెడల్పు 72 అడుగులు; 8 1/2 అడుగుల లోతున నీరు ప్రవహిస్తుంటుంది. హైదరాబాదు దిశన త్రవ్వుతున్న కాలువ నిడివి 127 మైళ్లు. దీనికి చెందిన చిన్నకాలువలన్నీ చేరి వెయ్యిమైళ్ల వరకూ వుంటవి. కాలువల త్రవ్వకం పూర్తి అయినప్పుడు, ఆఖరుదశలో ఉభయ పార్శ్వాలనా మొత్తం 20 లక్షల ఎకరాల సేద్యానికి నీరు ఇవ్వవచ్చు. ప్రస్తుతానికి మాత్రం ఆంధ్ర మైసూరు రాష్ట్రాలలో మూడు లక్షల ఎకరాలకు, హైదరాబాదు వైపున—ముఖ్యంగా రాయచూరు జిల్లాలో—5 లక్షల 80 వేల ఎకరాలకు మాత్రమే నీరు సప్లయిచేస్తారు. రేపు నవంబరు 1 న జరిగే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణతో ఈ జిల్లా కొత్త మైసూరు రాష్ట్రంలో చేరిపోతుంది. తుంగభద్ర ప్రాజెక్టు డాం స్థలంలోనే ఆనకట్ట తూముల ఇనపతలుపులు, అలుగు ప్రాంతంలో అమర్చే తలుపులు తయారు చేయడానికి బ్రహ్మాండమైన కర్మాగారం వుంది. తుంగభద్ర డాంకు ఉపయోగించిన తలుపులు ఇక్కడివే. ఈ కర్మాగారం ఇతర ప్రాజెక్టులకు కూడా పరికరాలను, ఇనపగొట్టాలను, మట్టరనుతయారుచేసి ఇవ్వగలుగుతున్నది. దేశం మొత్తం మీద ఇలాంటి కర్మాగారం ఇదొక్కటే.

తుంగభద్ర ప్రాజెక్టులో పైన చెప్పిన దిగువ కాల్వలే గాక, ఆంధ్ర మైసూరు రాష్ట్రాలలో ప్రవహించే ఎగువ కాల్వను కూడా నిర్మించాలన్నది కొత్తగా కలిగిన ఉద్దేశం కాదు. దీనికి కావలసిన తూములను డాంలో మొదటే ఏర్పాటుచేశారు. ఈ కాలువ పొడవు 120 మైళ్లు; దిగువ కాలువల మట్టానికంటే 35 అడుగుల ఎత్తుగా ఆనకట్ట వద్ద ఏర్పడి ఇది ప్రవహిస్తుంది. ఈ కాలువకు ఖర్చు 20 కోట్లు.

ఆనకట్ట నిర్మాణమేగాక, దిగువకాలువలలో చాలాభాగంకూడా పూర్తిఅయిన మూడేళ్లకుగాని ఈ ఎగువకాలువ నిర్మాణాన్ని ప్రారంభించడం సాధ్యపడలేదు ఇది అసలు ఒకప్రత్యేకప్రాజెక్టేకాదు తుంగభద్ర ప్రాజెక్టులో ప్రధానమైన అంతర్భాగమే. అనవసరంగా దీన్ని నాగార్జునసాగరం ప్రాజెక్టుతో ముడిపెట్టి కాలహరణంచేయడం జరిగింది. ప్రత్యేకరాష్ట్రం ఏర్పడగానే, మూడేళ్ళక్రితం ప్రథమ ప్రణాళికాకాలంలోనే ప్రారంభించినట్లయితే, దీని నిర్మాణము ఈపాటికి దాదాపు పూర్తి అయి వుండేది. మొత్తం నాలుగువేల క్యూసెక్కుల నీరు ప్రవహించే ఈకాలువ క్రింద ఆంధ్ర



శ్రీ త్రివేదీ
ఆంధ్రప్రదేశ్‌కు గవర్నర్ కావచ్చు.

## ★ తుంగభద్ర ఎగువ కాలవ ★

మైసూరురాష్ట్రంలో మూడు లక్షల,80 వేల ఎకరాలభూమికి (బళ్లారి, అనంతపురం, కడప జిల్లాలలో) సాగు సౌకర్యం లభ్యమవుతుంది. దీనిలో కొంతమెట్ట సాగుకు, కొంత పల్లపు సాగుకు వీలవుతుంది. హగరి నదిమీద నిర్మించే అక్విడక్టువద్ద ఈ మెరక కాలవ రెండుగా చీలిపోతుంది. ఒకటి కుంతకల్లువైపు వస్తుంది. రెండోది ఉరవకొండవద్ద పెన్నా నదిలో కలుస్తుంది. పెన్నా నదిమీద "బరాజ్" నిర్మించవలసి వస్తుంది. బళ్లారి హోస్పేట రైలుమార్గాన్ని ఈ ఎగువ కాలువ పాము మెలికలు తిరిగినట్లు తిరుగుతూ మొత్తం నాలుసార్లు దాటుతుంది.

మైసూరురాష్ట్రంలోని పడమటి కనుమలకు చెందిన వరాహ పర్వతంలో ఉద్భవించే తుంగ, భద్రనదులు బళ్లారి జిల్లాలో కూడలి అనేచోట, కలసిపోయి తుంగభద్ర అవుతున్నవి ఇది దాదాపు నాలుగువందల మైళ్లు ప్రవహించి, కృష్ణా నదిలో కలసిపోతుంది. మొత్తం 26,858 చదరపు మైళ్ళ భూభాగంలోపడే వర్షపుజలమంతా వచ్చి తుంగభద్రలో కలుస్తుంది. తుంగభద్ర నదినే మనవారు "పంపానది" అని కూడా పిలుస్తారు. ఈ పంపానదీ తీరంలోనే రాజధానిని ఏర్పరచుకుని విజయనగర సామ్రాజ్యం వర్ధిల్లింది.

తుంగభద్రప్రాజెక్టు ముఖ్యంగా సాగునీటి సౌకర్యానికి ఉద్దేశించిందే అయినప్పటికీ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికికూడా చాలా అవకాశం ఉంది ప్రస్తుతం ఆంధ్ర మైసూరు రాష్ట్రాల దిశన తుది దశలలో 63 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి, హైదరాబాదు దిశన 36 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి-మొత్తం 99 వేల కిలోవాట్లు-ఉత్పత్తిచేయవచ్చు.

ఒక్క ఆంధ్రరాష్ట్రంలోనే కృష్ణానదిపై మొత్తం మూడు పెద్దప్రాజెక్టులు కట్టాలని సంకల్పం. ఇవే నాగార్జునసాగరం, పులిచింతల, సిద్ధేశ్వరం పథకాలు. నాగార్జున సాగరానికి శంకుస్థాపన జరిగిన పదినెలలకే తుంగభద్ర ఎగువ కాలవ నిర్మాణానికి ప్రారంభోత్సవం జరగడం విశేషం.

కృష్ణానదిపై ఆంధ్రలో నిర్మించే ప్రాజెక్టులేగాక, బొంబాయి రాష్ట్రంలో కోయినా అనేచోటకూడా మరొక ప్రాజెక్టును నిర్మిస్తున్నారు. కృష్ణానదీ జలాలను పశ్చిమ కనుమలలో తవ్వే సొరంగం గుండా ప్రవహింపజేసి ఆ ప్రవాహం 1600అడుగుల ఎత్తునుంచి కిందికి పడేట్లుచేస్తారు. అక్కడ పెద్ద విద్యుతుత్పాదక కేంద్రం ఏర్పడుతుంది. నాగార్జునసాగరం, కోయినా, జోగ్, శివసముద్రం, తుంగభద్ర విద్యుచ్ఛక్తి కేంద్రాలను ఒకదానితో ఒకటి కలిపి,మరొక పదేళ్ళలోపలే, ఒకే ఒక బ్రహ్మాండమైన 'గ్రిడ్'ను ఏర్పాటుచేసే అవకాశం లేకపోలేదు.

"రిజర్వాయర్ లో నీళ్లు పుష్కలంగా వున్నవి; నీటికోసం భూమి పరితపిస్తున్నది; విద్యుచ్ఛక్తి అవసరం ప్రజలకు ఎక్కువైంది! యుద్ధమేఘాలు దోబూచులాడుతున్నవి. వీలైనంత త్వరగా పరిశ్రమలు, నీటివనరులు అభివృద్ధిచేసుకొని, ఆహారధాన్యాలను ఎక్కువగా పండించాలి. ఈ ప్రాజెక్టుక్రింద నిర్మించదలచిన విద్యుచ్ఛక్తి కేంద్రాలను కూడా త్వరగా పూర్తిచేయాలి," అని తుంగభద్ర బోర్డు అధ్యక్షుడు శ్రీ గోఖలే మొన్నటి ఉత్సవంలో రాష్ట్ర ప్రభుత్వాలకు చేసిన విజ్ఞప్తి గమనార్హమైనటిది.

దాదాపు రెండులక్షల టన్నుల అదనపు ఆహారధాన్యాలను పండించడానికి వీలైన ఈ ఎగువకాలవ నిర్మాణాన్ని రాయలసీమ సోదరులు ఎంతో కాలంనుంచీ అభిలషించారు. దీనికి శంకుస్థాపన జరగడంతో తుంగభద్ర ప్రాజెక్టుకు పరిపూర్ణత్వం సిద్ధించిందనే చెప్పాలి. ఆంధ్రరాష్ట్ర పరిపూర్ణత్వం, ఈ ప్రాజెక్టు పరిపూర్ణత్వం దాదాపు ఒకేసారి సిద్ధించడం చరిత్రాత్మకమైన విషయం. దీని నిర్మాణాన్ని ఐదేళ్లలోపలే పూర్తిచేయాలనే సంకల్పంతో పనిచేయాలి. ★



# న్యూఢిల్లీ లేఖ

దక్షిణ ఆర్కాట్ జిల్లాలో లిగ్నైట్ ప్రాజెక్టును కొనసాగించడానికే భారతప్రభుత్వం నిశ్చయించిందని ఉత్పత్తి శాఖా మంత్రి శ్రీ కె. సి. రెడ్డి ప్రకటించారు. ఇది సకలార్థసాధక మైన ప్రాజెక్టుగా రూపొందుతుంది. బొగ్గు నేకాక విద్యుచ్ఛక్తిని, ఎరువులను కూడా ఉత్పత్తి చేస్తుంది. లిగ్నైట్ ఖనిజ సంపదను విజయవంతముగా వినియోగించగలిగిన దేశం పశ్చిమ జర్మనీ. లిగ్నైట్ గనుల్లోంచి తయారు చేసే బొగ్గును చాలాపనులకు ఉపయోగించవచ్చును.

ముడిబొగ్గులో కొంతభాగం విద్యుదుత్పత్తి కేంద్రానికి ఉపయోగపడుతుంది. మరికొంత ముడిబొగ్గును వలగగొట్టి పరిశుద్ధం చేసి డ్రైయింగ్ కర్మాగారానికి ఉపయోగిస్తారు. ముడిబొగ్గులో నూటికి 53 నుండి 65 వంతులదాకా ఉండే నీటిని 10 నుండి 15 వంతులదాకా డ్రైయింగ్ కర్మాగారంలో నే తగ్గిస్తారు. ఈవిధంగా తడితీసివేయగా మిగిలిన పొడిబొగ్గును పెద్ద పెద్ద బొగ్గు పలకలుగా తయారుచేసే బ్రికెటింగ్ కర్మాగారానికి పంపిస్తారు. మద్రాసు బొగ్గునుండి మంచిరకం బొగ్గుపలకలను తయారు చెయ్యాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఈపలకలను తక్కువ వేడితో కార్బొనైజ్ చేసి పరిశుభ్రమైన ముద్దబొగ్గును తయారు చేయవచ్చును. అంతేకాక కర్మాగారాల్లో ఎకాయెకిగా ఉపయోగించడానికి వీలైన బొగ్గు పలకలను తయారు చేయవచ్చును. మద్రాసు (దక్షిణ ఆర్కాట్) లిగ్నైట్‌ను ఇలా ఉపయోగించడానికి కొన్ని చిక్కులున్నాయి. ఎందుచేతంటే ఈ బొగ్గు పలకలకు చెమ్మగాలి సోకితే కరిగిపోతాయి. అలా కరిగిపోకుండా కొన్ని ప్రత్యేక రక్షణలు కల్పించాలి. బొగ్గుపలకలను ఎకాయెకిగా ఉపయోగించకుండా, తక్కువ వేడితో ముందు కార్బొనైజ్ చేసి ముద్ద బొగ్గుగా మార్చి అప్పుడు ఉపయోగిస్తే పైన చెప్పినట్లు కరిగిపోయే అవకాశం ఉండదు. ఈ ముద్దబొగ్గుకు ఏ గాలి తగిలినా ప్రమాదం లేదు. మామూలు కర్రబొగ్గు మండినంత చక్కగా యీ ముద్దబొగ్గు మండుతుంది. కనుక ఇళ్ళలో ఉపయోగించడానికి, పెద్ద పెద్ద పరిశ్రమలలో ఉపయోగించడానికీ కూడా పనికొస్తుంది. దీన్ని 0 నుండి ¼ అంశాల వరకూ వివిధ పరిమాణాలలో తయారుచేసి సేలం ముడి ఇనుమును క్రప్-రెన్ విధానంలో కరిగించడానికి ఉపయోగించవచ్చును.

తక్కువ వేడితో కార్బొనైజ్ చేయడం వలన లభించే ద్రవపదార్థాలను వడపోసి,

**శ్రీ కృష్ణ**
(ఆంధ్రపత్రిక విలేఖరి)

పరిశుభ్రం చేసి గొడ్డుతారు, డీసెల్ ఆయిల్ ఫ్యూయల్ ఆయిల్, గాసొలిన్ మొదలైనవి తయారు చేయవచ్చు. బెర్గియస్ హైడ్రోజినేషన్ విధానంలో పరిశుభ్రం చేస్తే ఆ ద్రవపదార్థాలన్నిటినీ గాసొలిన్‌గానే మార్చవచ్చు.

బొగ్గు పలకలను అమ్లజని సహాయంతో వాయుపదార్థంగా మార్చి, పట్టణాలలో, పైప్ లైన్లలో ఉపయోగించే గ్యాస్‌గా మార్చవచ్చు. ఆ గ్యాస్‌ను కృత్రిమ వాయుపదార్థంగా మార్చి, యూరియా, తదితర ఎరువు లవణాలు తయారు చేసేందుకు ఉపయోగించవచ్చు. వాయుపదార్థంగా మార్చేటప్పుడు లభించే ద్రవపదార్థాలను అంటే తారు మొదలైనవానిని తక్కువ వేడితో కార్బొనైజ్ చేసినప్పుడు లభించే తారులాగానే వాడవచ్చు. అంతేకాక ఆ రెండురకాల తారునుండి ముడి ఫినాల్ తీయవచ్చు.

నూటికి 58 నుండి 55 దాకా నీరువున్న మదరాసు లిగ్నైట్‌కు అగ్నికారక పదార్థముగా విలువ చాలా

శ్రీ కె. వెంకటకిషన్ రావు అన్నగారికి

మీరు తెలియపరచకుండా అకస్మాత్తుగా దక్షిణయాత్రకై బయలుదేరి ఒక మాసము రోజులుగడచినది. మీరు ప్రస్తుతము ఎక్కడ వున్నారు - ఎప్పుడు తిరిగి రాగలరు - యీ విషయం తెలియక చాలావిచారముగఉన్నది. దయచేసి తంతిద్వారా మీ యోగక్షేమములు తక్షణం తెలిపేది. విధేయుడు-తమ్ముడు

సి. రాఘవేంద్రరావు.

హైదరాబాదు.



తక్కువ. అందుచేత దగ్గరి ప్రదేశాలకు దానిని రవాణా చేయడం లాభసాటి అయితే కావచ్చునుగాని దూరప్రదేశాలకు తీసుకుపోవడం లాభకరం కాదు.

అదీగాక ఈలిగ్నైట్ యొక్క హోల్డింగ్ విలువ చాలా స్వల్పం అందుచేత దానిని ముఖ్యమైనచోట్ల వాడడానికి వీలులేదు

జర్మనీలోనూ, ఆ తరవాత ఆస్ట్రేలియాలోనూ లభించిన పెద్ద పెద్ద లిగ్నైట్ గనులలో లిగ్నైట్‌ను ముందు నిర్జలంచేసి తరవాత బొగ్గుపలకలుగా మార్చవలసి వచ్చింది.



భారతనౌకాదళానికి ప్రప్రథమ భారతీయ పతాకోద్యోగి. రియర్ అడ్మిరల్ రామదాస్ కటారీ

అందుచేత స్థానిక పరిస్థితుల కనుగుణంగా తక్కువ ఒత్తిడి ఆవిరితో వేడిచేసి నిర్జలీకరించడం, అగ్నివాయువులతో నిర్జలీకరించడం మున్నగు పద్ధతులను ఇక్కడ అవలంబించవలసి వచ్చింది

లిగ్నైట్‌కు గాలిసోకడం వలన వచ్చే ఇబ్బందులను తొలగించడానికి, తారు నూనెలు మొదలైనవాటిని జాగ్రత్తగా వెలికి తీయడానికి, బొగ్గుపలకలను తక్కువ వేడితో కార్బొనైజ్ చేయవలసిన అవసరంఏర్పడింది.

తక్కువ వేడితో కార్బొనైజ్ చేయడమనగా 850 డిగ్రీల వేడిమిని ఉపయోగించడమన్నమాట. అమ్లజని లేనప్పుడు తారు నూనెలు, ఒకమాదిరి ముద్దబొగ్గు, తక్కువ వేడితో కార్బొనైజ్ చేసినప్పుడు వచ్చే గ్యాస్ ఈ విధానంవలన లభిస్తాయి. తారు, ఒకమాదిరి నూనె, గ్యాస్ వాష్తాపాలలో పారఫిన్, హైడ్రోజనులు బాగా కలిగిన ద్రవహైడ్రోకార్బనను హైడ్రోజినేషన్ ద్వారా గాని, సెలక్టివ్ సాల్వెంట్లతో గాని తీస్తారు. వాటిని ఆ తరవాత మార్కెట్‌లో అమ్మడానికి పనికివచ్చే పదార్థాలుగా తయారు చేస్తారు.

తక్కువ వేడితో కార్బొనైజ్ చేసినప్పుడు ఏర్పడే అగ్నివాయువులను, సాధారణంగా చిన్నసైజులో లభించే సెమీకోక్‌ను తారు నూనెలు తయారుచేసే యంత్రాగారాల్లో అగ్నికారక ద్రవ్యాలుగా ఉపయోగిస్తారు. విద్యుదుత్పత్తి కేంద్రాలలోను, ఇతర పారిశ్రామిక యంత్రాగారాలలోనుకూడా ఉపయోగిస్తారు.

పెద్దపెద్ద మంటలు మండించడానికి పనికివచ్చే వాయువులను గ్రాన్యులర్ లిగ్నైట్ నుండిగాని లిగ్నైట్‌బొగ్గు పలకలనుండి గాని తీయవచ్చును. వాయు పదార్థాలుగా మార్చడానికి ఇటీవల ఒక కొత్తపద్ధతి ఉపయోగిస్తున్నారు. ఈ పద్ధతివల్ల ఎక్కడికక్కడ ఎంతగ్యాస్ కావాలంటే అంతగ్యాస్ ఉత్పత్తి చేయవచ్చును.

ఈగ్యాస్‌ను ఒకానొక రసాయనిక సమ్మేళనంలో గనుక తయారుచేసే కొన్ని కృత్రిమ పదార్థాలను ఉత్పత్తి చేసేందుకు వినియోగింపవచ్చును. భారత దేశంలో దానిని అమ్మోనియా సింథసిస్‌కు లాభసాటిగా వాడవచ్చును. అమ్మోనియానుండి, వృథాగాపోయే బొగ్గుపులుసు వాయువు నుండి యూరియా తయారు చేయవచ్చును. ఈ యూరియా ఎరువుగాను, పశువుల మేతను వృద్ధిచేసే పదార్థంగాను బాగా ప్రాధాన్యంలోకి వస్తోంది ప్లాస్టిక్సును, జిగురును (గ్లూ) తయారుచేయడానికి కూడా దాన్ని బాగా ఉపయోగిస్తున్నారు.

లిగ్నైట్ పరిశ్రమకు సంబంధించిన తక్కువ వేడి కార్బొనైజేషన్, హైడ్రోజినేషన్, గాసిఫికేషన్ యంత్రాలవలన ఫినాల్ కలిగిన ద్రవాలు ఉత్పత్తి అవుతాయి ఇవి ప్రమాదకారక ద్రవాలు కనుక వాటిని నదులలోనికి వదిలిపెటరు. ఆధునికమైన విధానాలను ఉపయోగించడంవలన ఆ ద్రవాలను పరిశుభ్రపరచడానికి, ఫినాల్ తయారుచేయడానికి వీలవుతోంది.

ఈ ఫినాల్ ద్రవాలు దైనికోపయోగ వస్తువుల నేకం తయారుచేయడానికి పనికివచ్చే బేక్‌లైట్‌ను ఉత్పత్తి చేయడానికి ముఖ్యాధారాలు వృథాగాపోయే కొయ్యను ఉపయోగించడం వాటివలన సాధ్యమవుతుంది. కనుక ముందుముందు గృహనిర్మాణ పరిశ్రమలో ప్రెస్ చేయబడిన ప్లేట్లతయారీ, ఫర్నిచర్ తయారీ ప్రాధాన్యం వహించగల సూచనలున్నాయి.

# * డిటెక్టివ్ రామారావు *

[illegible] ప్రసాదరావు

బుక్ స్టాల్‌లో అర డజను పుస్తకాలు కొని బిల్లు చెల్లించి, చిల్లర తీసుకుంటూన్న రామారావు బయటినుంచి "దొంగ...దొంగ..." అన్న కేకలు వినరావడంతో చిల్లర లెక్క పెట్టకుండానే జేబులో వేసుకుని హడావిడిగా బయటికి వచ్చాడు.

బయట పేవ్‌మెంటు మీద ఒక పెద్దమనిషి ఆయాసంతో ఒగరుస్తూ కేకలు పెడుతున్నాడు. భయాందోళనలు ఆయనను పూర్తిగా వశం చేసుకొన్నాయి. వినాయకుడి బొజ్జను మరిపించే పెద్దబొజ్జ ఆయన్నక్కడ నుంచి కదలనివ్వటం లేదు.

రామారావు ఒక్క అంగలో ఆయన వద్దకు ఉరికాడు. అప్పటికే ఆ పెద్దమనిషి చుట్టూ నలుగురూ పోగయ్యారు. ఆయన ఆందోళనతో మధ్యమధ్య చుట్టూరా మూగిన వారి తలల మీదుగా ప్రక్క సందులోకి చూస్తూ చెప్పుకుపోతున్నాడు. "ఎంత ఘోరం! ఇలాంటి పగటి దోపిడీ నేనెన్నడూ చూడలేదండీ! ఇంకా పూర్తిగా పది నిమిషాలన్నా అవలేదు నేనా డ్రాఫ్టు మార్చుకుని. ఇంతలో నేకొట్టేశాడా దొంగవెధవ."

రామారావు కళ్లు మెరిశాయి. తన చేతిలోని అరడజను సరికొత్త డిటెక్టివ్ నవలల్నొకసారి చూశాడు. వాటన్నిటి మీదా కళ్లు చెదరగొట్టే రంగుల్లో అతని అభిమాన డిటెక్టివులు ప్రత్యక్షమయ్యారు. ప్రఖ్యాతి డిటెక్టివ్ నవల "దిబ్బపోయిన శవం" అట్టమీద అతని అభిమాన డిటెక్టివ్ వేణు సరికొత్త కారులో శరవేగ విద్యుద్వేగాలతో దూసుకుపోతున్నాడు. మిగతా పుస్తకాలమీద సాహసవిక్రమార్కులైన హంతకులూ, దొంగలూ వంకర మొహాల్తో, దొంగచూపుల్తో, చేతుల్లో పిస్తోళ్లతో, బాకుల్తో టెక్నికలర్ ప్రింటులో ఇంకా భయంకరంగా కనిపిస్తూ రామారావు కళ్లలోకి సూటిగా చూస్తున్నారు.

వీటన్నిటినీ చూసి రామారావు ఉత్తేజితుడయ్యాడు. ఒకసారి కళ్లు మూసుకొని తన అభిమాన డిటెక్టివుల నందర్నీ స్మరించాడు. తాను యీ శుభక్షణాన్నుండి వారి అడుగుజాడలలో నడవబోతున్నాడు. ఇంటర్ సీనియర్ స్టూడెంట్ రామారావు ఈ క్షణం నుంచి డిటెక్టివ్ రామారావు కాబోతున్నాడు! ఇదెంత చరిత్రాత్మక క్షణం!!

రామారావు తక్షణం జేబులోంచి నోట్ బుక్ తీశాడు. తానింతవరకు ఎంతో కాలంగా సేకరిస్తున్న ప్రపంచ మేధావుల ప్రవచనాలున్న పన్నెండు పేజీలను సర్రున చింపి, అసహ్యంగా వాటివంక చూస్తూ ప్రక్కనున్న చెత్తకుండీలోకి విసిరేశాడు. పెన్ను తీసి చేత్తో పట్టుకుని, గుంపును తోసుకుంటూ ఆ పెద్దమనిషివద్దకు చేరుకున్నాడు.

ఆయన కళ్లలోకి ప్రశ్నార్థకంగా చూస్తూ అడిగాడు రామారావు. "ఊరికే కంగారుపడక ముందు నే నడిగే వివరాలన్నీ చెప్పండి. మీ పేరు?"

ఆ పెద్దమనిషే గాక అక్కడ చేరిన గుంపంతా కూడా రామారావును నఖశిఖ పర్యంతం వింతగా పరికించారు. ఉలెన్ ప్యాంటు, షార్క్‌స్కిన్ బుష్‌షర్టు, కళ్లకు కూలింగ్ గ్లాస్‌లతో రామారావు ఆ వేసంగి ఎండలో ధగధగ మెరిసిపోతున్నాడు.

ఆ పెద్దమనిషి ఏమనుకున్నాడో గాని వెంటనే జవాబిచ్చాడు.

"రామబ్రహ్మాచార్యులు"

"పని?"

"వ్యాపారం"

"ఏం వ్యాపారం?"

"ఎరువుల వ్యాపారం."

"ఎక్కడ?"

"ఇక్కడే!"

"అంటే నేనడిగేది మీ అడ్రసు సంగతి!"

"అదా! గాంధీనగర్‌లో రామాటాకీసు ఎదురుగా!"

"ఇక్కడేం చేస్తున్నారు?"

"బ్యాంకిలో డ్రాఫ్టు మార్చుకు వస్తున్నా!"

# ★ డిటెక్టివ్ రామారావు ★

రామారావు చిక్కుల్లో పడ్డాడు. బ్యాంకి చెక్కుల్ని గూర్చి అతనికి కొంత తెలుసునే గాని, డ్రాఫ్టు అంటే ఏమిటో, అదెలా ఉంటుందో, దాన్నెలా మార్చుకుంటారో అణుమాత్రం కూడా తెలియదు. తత్ఫలితంగా రామారావుకు 'డ్రాఫ్టు' అంటే ఏమిటో చెప్పని తన ఇంటర్ సీనియర్ చదువు మీదా, తన కాలేజీ మీదా యూనివర్సిటీ మీదా కోపం ముంచుకువచ్చింది. అది క్షణంలో బుడమేరు వరదలా పెరిగిపోయింది. ఆ క్షణంలోనే అతడొక నిర్ణయానికి వచ్చేశాడు. వెంటనే తన కాలేజీ చదువుకు స్వస్తి చెప్పి సర్ ఆర్థర్ కోనన్ డాయిల్ పుస్తకాల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలని.

ఈ ఆలోచనలతో రామారావు తిరిగి తన తక్షణ కార్యక్రమంలోకి దిగాడు.

"ఆ డ్రాఫ్టు ఎంత విలువ గలది?"

"వేయి రూపాయలు"

"మార్చుకొన్నారా?"

"మార్చుకున్నా బాగుండేది పోను. మార్చబట్టే నాగతి ఇలా ఉంది!" అంటూ ఆ పెద్దమనిషి రామారావు వంక అదోలా చూశాడు.




ఆ చూపుతో రామారావు తలవంచుకున్నాడు.

"ఇంతకీ మీడబ్బు ఎలా పోయిందో తెలుసా?"

"డ్రాఫ్టు మార్చి అన్నీ వందరూపాయల నోట్లు తీసుకొన్నాను. అవి పర్సులో పెట్టి ఈ ప్రక్క జేబులో పెట్టుకున్నా!" అంటూ ఆయన తన లాల్చీ జేబులు రెండూ చూపెట్టాడు.

"డబ్బుపోయినట్లు మీకు ఎప్పుడు, ఎలా తెలిసింది?" అనడిగాడు రామారావు మధ్యలో అడ్డంవస్తూ.

"బ్యాంకినించి బయటికి రాగానే ఖాళీ రిక్షాకోసం చూస్తూ ఇక్కడే నిలబడి సిగరెట్టు వెలిగించుకొన్నాను. తిరిగి అగ్గిపెట్టె జేబులో పెడుదునుగదా, గుండెలాగిపోయాయి అగ్గిపెట్టె క్రింద బడిపోయింది. పర్సు మాయమయింది జేబు కత్తిరించబడి ఉంది.

ఒక క్షణమాగి ఊపిరి తీసుకొని ఆయన తిరిగి చెప్పసాగాడు. "దాంతో తలతిరిగిపోయింది. ఆదుర్దాగా నలుదిక్కులా చూశాను. ఈ సందులోకి ఎవడో బొడ్లో ఏదో దోపుకుంటూ, చుట్టూరా దొంగచూపులు చూస్తూ పోతున్నాడు. వాడు బొడ్లో దోపుకొంటున్నది నా పర్సులాగే కనిపించింది. వెంటనే దొంగ దొంగ అని కేకలు వేశాను. అదివిని వాడు పరుగులు తీశాడు. ఇక్కడ డ్యూటీలో ఉన్న పోలీసాయన నా కేకలువిని సైకిలుమీద వాడివెంట పడ్డాడు." అని ఆయన ఒక నిట్టూర్పు విడిచాడు.

"పోలీసు సైకిలుమీద వెళ్లాడన్నమాట! అయితే ఫరవాలేదు. దొంగ యీపాటికి దొరికి ఉండవచ్చు." అంటూ అక్కడ మూగిన గుంపులోంచి కొందరు సానుభూతి వాక్యాలు పలికారు.

ఆ మాటలు రామారావుకు కంపర మెత్తించాయి. పటపగలు వేయిరూపాయలు చోరీ చేసిన గజదొంగని ఒక మామూలు ట్రాఫిక్ పోలీసు పట్టుకోవటమా! ఛ...ఛ...! సర్క్యులిన్‌స్పెక్టరయినా యింత పెద్దకేసును పట్టుకోగలడా? లేదు. డిటెక్టివ్ వేణు లాంటి ప్రఖ్యాత పరిశోధకులు మాత్రమే యిలాంటి గజచోరీ కేసుల్ని పరిష్కరించగలరు. వారిశిష్యుడయిన తాను ప్రయత్నిస్తే ఫలితము ఉండకపోదు

అంత పెద్ద కేసును తాను పరిష్కరించబోతున్నానన్న ధీమాతో రామారావుకు తన ప్రశ్నల్ని, ఆయన జవాబుల్ని త్వరత్వరగా నోట్ చేసుకోవటం కష్టమనిపించింది. అయినా తిప్పలు ఇంకో లాగవలసిన సమాచారం, అడగవలసిన ప్రశ్నలు చాలా ఉన్నాయి. తనకు కూడా ఒక అసిస్టెంట్ ఉంటే ఎంత బాగుండిపోను! తనకిక్రను

# మంత్రాలు: నమ్మకాలు

# గడమీద దొమ్మరసాని గాథ

## జరగ్గా చూశామని చెప్పగా విన్నది.

ఒకసారొక ఊళ్లో దొమ్మరాట జరుగుతోంది. దుర్గ అనే దొమ్మరిసాని గడ ఎక్కి ఆడుతోంది. ఆమె చూడటానికి ఆకర్షవంతంగా ఉంది. మంచి అవయవపుష్టి కలిగిన వ్యక్తి. అంతా ఆమెవంకే రెప్పార్పక చూస్తున్నారు. ఆమె గడ ఎక్కే ముందు సభవారికి నమస్కరించలేదు వారి అనుమతీ ఆశీర్వాదం తీసుకోలేదు. ఆమెకెంత అహంభావం అని సభలో ఉన్న కంసల కౌసయ్య అనుకున్నాడు. ఆమెను పరాభవం చెయ్యాలనుకున్నాడు. అతను మంత్రవేత్తకనుక మంత్రం ఉచ్చరించాడు.

ఇరవై అయిదు అడుగుల ఎత్తుగల గడమీద దొమ్మరి దుర్గ ఒక కాలుమీద వేరొక కాలు పెట్టుకుని చేతులు బారచాచి రొమ్ము ముందుకు విరిచింది. ఇంతలో హఠాత్తుగా ఆమె కట్టుకున్న చీర గొడుగులాగ పైకి లేచింది. ఎంత సవరింప ప్రయత్నించినా సాధ్యపడలేదు. ఆమె నగ్నదేహం చూచి కొందరు కళ్లు మూసుకున్నారు. కొందరు అసహ్యించుకున్నారు కొందరు ఆనందించారు. ఆమె మానం పోయిందన్నారు. నెమ్మదిగా ఆమె అట్లే గడ దిగి వచ్చింది. తనపై మంత్ర ప్రయోగం జరిగిందని, ప్రయోగించినది కౌసయ్య అనీ గ్రహించి ప్రతిక్రియ చేయబూనుకున్నది.

మర్నాడామె కౌసయ్య ఇంటికి వెళ్ళి "నిప్పు కావాలి దొరా" అన్నది. "పిడికెడు నిప్పు తేవే" అని కౌసయ్య భార్యను ఆజ్ఞాపించాడు. భార్య కణకణలాడే నిప్పులు పిడికిట్లో పట్టుకొచ్చి ఇచ్చింది. ఆ నిప్పులు దుర్గ తన చీర చెరగులో పోసుకుని తీసుకుని పోయింది. ఆమె చేయి కాలలేదు ఆమె చెరగు చీలలేదు. ఒక గంట తరవాత కౌసయ్య ధర్మయ్య ఇంటికి వెళ్దామని బయల్దేరాడు. కాలు తీసి పొరపాటున గడపమీద వేశాడు. పాము కాటు తిన్నట్లు మంట పుట్టింది. కాని, పామెక్కడా లేదు. గడపమీద దుర్గ సర్పతంత్రం చేసిందని గ్రహించాడు. దానికి విరుగుడు వేసే వేళ మించిపోయింది. అలాగే తూలుకుంటూ అతను ధర్మయ్య ఇంటికి నడిచిపోయి, "జయం నాదేనే దుర్గా" అంటూ ప్రాణం వదిలాడు

—కె. లక్ష్మీనారాయణ
—గొర్లమూడిపేడు (కడపజిల్లా)

* * *

## స్వయంగా చూసినది

ఒకనాడు మధ్యాహ్నం నిద్రపోయి రెండుగంటల వేళ లేచాను ఇంతలో ఒక రైతు ఏడుస్తూ మా పక్కింటి సాంబయ్యగారి వద్దకు వెళ్ళాడు వెనకాల వస్తున్న జవాన్ని అడిగితే పొలంలోంచి వస్తుంటే అతనికి నాగతేలు కుట్టిందన్నారు మంత్రాలమీద నాకు నమ్మకం లేకపోయినా ఏం జరుగుతుందో చూద్దామని వెళ్లాను సాంబయ్యగారు ఏదో మంత్రం పఠించారు ఒకరు కొంత వేపరొట్ట తెచ్చి ఇచ్చారు ఆయన దేనో నోట్లో గొణుక్కుంటూ ముమ్మారు వేపరొట్టను కుట్టినచోట తిప్పి అవతల పారేశారు రైతును కాలు జాడించి కొంచెం దూరం నడవమన్నారు. అంతసేపూ ఏడుస్తున్న మనిషి శుభ్రంగా మామూలు మనిషైపోయి బాధ తగ్గిపోయిందని చెప్పి సెలవు తీసుకుని వెళ్లిపోయాడు. దీన్నేమంటారు?

కాళీపట్నపు శ్రీరామమూర్తి
—దార్లపూడి.

* * *

## చెప్తే నమ్మరేమో

మధ్యాహ్నం 12 గంటల వేళ సుమారు 12 ఏళ్ల కుర్రవాడు భరించలేని బాధతో, మా వూళ్లో హోమియో వైద్యం చేసేవారింటికి వచ్చాడు తేలుకుట్టిందని. తాటిమటలు తీస్తుంటే కుట్టింది. దాన్ని దంచేసేరు. ఆయన 4, 5 మాత్రలు మింగించారు. గంటపైగా గడిచింది రాను రాను కుర్రవాడు

అమితంగా బాధపడిపోతూ, భరించలేక క్రింద దొర్లుతున్నాడు. చుట్టూ ఉన్నవాళ్లు అయ్యోపాపమని జాలిచూపేకంటె ఏమీ చేయలేకపోతున్నారు.

ఇంతలో కృష్ణమూర్తిగారు, స్టేషనుమాష్టరుగా ఉండి విశ్రాంతి తీసుకుంటూ, మా ఊళ్ళోవున్న పంటభూముల్ని చూచిపోదామని వచ్చేరు. కుర్రవాని గోల, నలుగురు మూగటం చూచి సంగతి తెలుసుకొని "తేలు కుడితే యింత హడావిడి ఏమిటి? పట్రండ్రా రెండు వేపకొమ్మలు" అన్నారు. అతను మంత్రం వేస్తారని ఆవూళ్ళో ఎవరికీ తెలియదు. వేపకొమ్మలు అందుకొని తేలు కుట్టినచోట మంత్రించారు. చెప్తే నమ్మరేమో 2, 3 నిమిషాల్లో బాధనివారణై కుర్రవాడు కులుకుతూ యింటికిపోయాడు.

అదంతా చూస్తున్న ఉత్సాహి అతనిని అర్థించగా ఆ మంత్రం చెప్పారు. ఉడతాభక్తిగా ఊళ్లో ఉపయోగకరంగానే ఉంది. పాముా, తేలుకాట్లకు మంత్రాలుకూడా పని చేస్తాయనే మావూళ్లో చాలామంది నమ్ముతారు.

—వారణాసి ధర్మారావు

విజయనగరం.

* * *

## గ్రహ ప్రయోగం

నా చిన్నతనంలో నేను కూడా, కొంతమంది మాదిరిగా దెయ్యాలన్నా, భూతాలన్నా, ప్రయోగాలన్నా, చేతబడులన్నా ఆఖరుకు మంత్రశాస్త్రమన్నా అట్టే నమ్మేవాడినికాదు. కాని ప్రత్యక్షంగా కొన్ని సందర్భాలలో చూచినందున, ఆప్తబంధువుల ద్వారా వినడంవలన, నమ్మకుండా వుండలేక పోయినాను. నా అనుభవంలోది, ఇప్పటికి సుమారు నలభై సంవత్సరాల క్రితం జరిగినది, ఒక సంఘటన వ్రాస్తాను.

అప్పుడు నాకు సుమారు పదిసంవత్సరాల వయస్సు వుంటుంది. విజయనగరంలో ఉండే వాళ్ళం. అప్పుడు మాకు ఒక పురోహితుడు వుండేవాడు. అతను వైదికంలోను, వేదశాస్త్రాలలోనూ మంచి ప్రవేశం కలవాడు, ఆయనకు క్షుద్రగ్రహ ఉపాసన వున్నదని మాత్రం అప్పట్లో మాయెవ్వరకూ తెలియదు.

ఇలా వుంటూవుండగా ఒకసారి మా పెత్తల్లి కూతురికి, కోడలికీకూడా ఒక్కసారే జబ్బుచేసింది. తిండి తినకపోవడం, తిన్నకొంచెంకూడా వాంతి చేసుకోవడం, ఈ మాదిరిగా ఏ జబ్బో తెలియకుండా, ఏ వైద్యానికీ కుదరకుండా కొంతకాలం గడిచింది.

తరువాత కొంతమంది గ్రహబాధేమో చూపించమని సలహా ఇచ్చిన మీదట, భూతవైద్యుణ్ని తీసుకువచ్చి చూపించినారు. కాని ఎంతమంది భూతవైద్యులు ప్రయత్నించినా తాత్కాలిక వుపశమనమే కాని పూర్తిగా అది ఏమిటో తెలియలేదు. ఒకసారి ఒక మంత్రవేత్త వచ్చి యంత్రం వేసి రెండు పాదములు దానిమీద ఉంచమని, మంత్రశక్తివలన రెండు పాదములను స్థాపన చేసి. పాదములను తీసుకొనమనగా బంధించివేసినావు కనుక స్వాధీనము కాలేదని అతిదీనముగా చెప్పినది. వానికి లొంగినది కనుక అన్ని ప్రశ్నలూ వేసి ఎవరు పంపినది, ఎందుకు పంపినది, ఏవిధముగా పంపినది అంతా పలికించినాడు. అప్పుడు మొట్టమొదటిసారిగా భూతముల ఉనికి, వాటిని మానవులపై ప్రయోగించుట, అవి చెప్పెడి కొన్ని యదార్థవిషయముల వలన, మంత్రశాస్త్ర మొకటున్నదని, దానిని యథావిధిగా అభ్యసించుటవలన అస్త్రశస్త్రములవలెనే, గ్రహముల యొక్క ప్రయోగ ఉపసంహారములు కూడా సాధ్యములని నమ్మవలసిన పరిస్థితి ఏర్పడినది. ఈ మాదిరిగా మేము ప్రయోగగ్రహములను భూతవైద్యులవలన విడిపించుకొనుచుండగా ఆయన తిరుగా వేరొకశక్తివంతమైన గ్రహమును అధిక మంత్రబలమునిచ్చి పంపుచుండెడివాడు. అది సామాన్యమైన భూతవైద్యులను లెక్కచేయక అధిక బాధల నొందజేయుచుండెడిది. ఆఖరున ఆయన శక్తినొకదానిని ప్రయోగము చేసెను. అది చాలా భయంకరమైన పనులు చేసెడిది. ఉన్నట్టుండి కట్టుకున్నబట్ట కాలిపోవుట, రక్తము వమనము చేయుట, మనిషిని నూతిలో త్రోయుమని పురికొల్పుట, ఏ పదార్థముగాని, మంచి నీరుగాని, కంఠము దిగకుండ చేయుట, మొదలుగాగల విచిత్రములు చేసెడిది. రోగలక్షణములు కావు గ్రహాలక్షణము లేవని విశ్వసించుటకు నాకు ముఖ్యముగా తోడ్పడినవి యీదిగువ నుదహరించిన విషయములు:

(1) ప్రయోగము చేసినవాడు ఎప్పుడు, ఎక్కడ ఏమిచేయుచున్నది భూతము చెప్పిన మీదట, నేను వెళ్లి కనుగొనగా యదార్థముగా అదే వేళలో, అదే ప్రదేశమున, అదే పని చేయుచుండుట. (2) మనము చూచుచుండగనే కట్టుకొని యుండు బట్ట మండుట (3) టెంకాయ మొదలుగా గల ద్రవ్యములు మంత్రించి పాతిపెట్టిన స్థలము భూతము చెప్పిన మీదట వెళ్లి పరీక్షచేయగా అవన్నియూ అక్కడ కనపడుట. ఇటువంటి విచిత్ర సంఘటనలు చూస్తూ, వింటూకూడా. ఎలా నమ్మకపోవడం? ఈ బాధలు పొందిన ఇద్దరు స్త్రీలూ ఇప్పటికీ సజీవులై వున్నారు. చేసిన ఆసామి కుటుంబంవారు చాలాకాలంక్రితమే ఆయన దుర్మార్గం వల్లనే చనిపోయారని, ఆయన కూడా ఆఖరుకు చాలా శోచనీయమైన అంత్యదశను పొందినాడని వింటిని. ఇది మంత్రశక్తి యొక్క దుర్వినియోగఫలమని అందరూ అనుకున్నారు.

పుల్లేటివు వెంకట్రావు.

తుని.

(32-వ పేజీ చూడండి)



## (మూడో అంకం తరువాయి)

ఫణి: నేనా?... నేనేం చెప్పడం లేదే...

జా: ఆఁ ఆఁ - అడబ్బ సంగతి! అది మీ కెక్కడనుంచి వచ్చిందో చెప్తే చాలా సంతోషిస్తాను. నాలుగువందలు ఎప్పుడూ జేబులో వుండవు చూడండి సామాన్యంగా ఎవరికి గానీ!

ఫణి: రెండువందలన్నారిందాక?

జా: అన్నానా?...ఆఁ-అవును. కాని మా సి. ఐ. డి. ఇంకో సంగతికూడా రిపోర్టు చేశాడు. ఇందాక చెప్పడం మర్చిపోయాను. తారాచంద్ రామ్‌చంద్ అనే మార్వాడీకి మీరున్న బాకీ నాలుగువందలయాభైరూపాయలూ కూడా వడ్డీతో సహా తీర్చేశారటగా!

ఫణి: పాపం చాలా కష్టపడ్డాడు మీ సి.ఐ.డి. సరాసరి నాదగ్గిరికే వచ్చి అడిగుంటే నేనే చెప్పేవాణ్ణి. మీతో కూడా రహస్యంగా వుంచుతానంటే చెప్తాను. అసలిలాంటివి మీ పోలీసులకి చెప్పరాదు. మా క్లబ్బులో పేకాటలో గెల్చాను.

జా: పదిహేనువందల రూపాయలా?

ఫణి: వెధవది, పదిహేనువందలేముందండీ పదిహేను వేలు గెలిచే ఆటల్లేవూ?

[వంటయింటివైపు ఓసారి క్రీగంట చూస్తాడు.]

జా: ఐసీ. (చిరునవ్వుతో) ఈమాట ఇందాకనే ఎందుకు చెప్పారు కారండీ?

ఫణి: నా మొహం! నా భార్య ఓ చెంప జైల్లో పడి చావుబతుకులమధ్య వుంటే నేనింకా క్లబ్బులకీ పేకాటలకీ వెళ్తున్నానని మీ కేమైనా అనుకుని పోతారేమోనని!

జా: (జాలిగా) ప్చ్ - నిజమే సార్. మీ బాధ నాకర్థంఅయింది. ఏదో వ్యాపకం అలా కల్పించుకుంటే ఈ బాధ కాస్త మర్చిపోవచ్చు (వాకిలికేసి వెళ్తూ) వెల్. అంతేగా ఇప్పుడు తెలిసింది. వస్తాను. క్షమించండి. ఇలాంటి టైములో పాపం మిమ్మల్ని—

ఫణి: అహ-దానికేం లెండి. మీ డ్యూటీ మీది! మరేం ఫరవాలేదు.

[ఫణి నాలుగడుగులు గబగబా ముందుకేసి వెళ్లి హాలుతలుపు తీయబోతూండగా ఇన్‌స్పెక్టరు రాక్ మీదనుంచి హాట్ తీసుకుని ఫణివంక తిరుగుతాడు.]

జా: (మామూలుగా) ఆఁ అన్నట్టు-ఇంకో సంగతి మీదగ్గిరేదైనా నీలిరంగు సూట్ కేసు తేలిగా ఉండేది-వుందా?

[దీంతో ఫణి తలక్రిందులైనాడు. కొన్ని సెకండ్లసేపు జవాబివ్వలేదు]

ఫణి: మీకు దొరికిందా యేమిటప్పుడే?

[ఇన్స్పెక్టరు తిరిగి హాలుమధ్యకు వస్తాడు]

జా: ఏం? మీరు పారేసుకున్నారా?

ఫణి: అవునండీ. ఏటాక్సీలోనో లోకల్ ట్రైన్‌లోనో పారేసుకుని వుంటాను. ఇంకా మీ పోలీసుస్టేషనుకు కూడా రిపోర్టు చెయ్యలేదు నేను-అప్పుడే మీకెలా తెలిసింది?

[ఇన్స్పెక్టరు ఫణిని చాలా నిశితంగా వాచ్ చేస్తున్నాడు. వంటయింటి తలుపు కొద్దిగా తెరుచుకుంటుందిగాని వారిద్దరూ అది చూడరు.]

జా: ఆ తుక్కోజీస్ క్యాషియర్ అన్నాటలెండి మీరు డబ్బిచ్చేటప్పుడు అది మీ వెంటే వుందని! తర్వాత మార్వాడీకూడా అలాగే చెప్పాట్ట మా సి. ఐ. డి. తో.

ఫణి: ఎప్పుడూ ఆఫీసు కాగితాలూ అవీ దాంట్లోనే పెట్టుకుంటూవుంటం అలవాటు నాకు. డబ్బుకూడా సామాన్యంగా దాంట్లోనే వుంచుతూంటాను.

జా: (వాకిలికేసి పోబోతూ) మంచిది. ఈ ఊళ్ళో టాక్సీవాళ్లు నమ్మకస్తులే లెండి. ఏం మర్చిపోయినా పాపం మళ్లీ తెచ్చి ఇస్తుంటారు.

[వంటయింట్లోంచి శంకరం వస్తాడు.]

ఓ! శంకరంగారా! గుడీవెనింగ్ సార్.

శం: గుడీవెనింగ్. ఒక్క క్షణం ఇన్స్పెక్టరు గారూ! మీరు వెళ్లకముందే ఫణి మీతో ఓ విషయం చెప్దామనుకుంటున్నాడు—

జా: ఆఁహాఁ?

(ఇన్స్పెక్టరు ఫణి వైపు తిరుగుతాడు. ఫణి శంకరంవంక తేరిపార చూస్తాడు: శంకరం సోఫాకేసి వెళ్ళి ఫణి బట్టలూ అవీ ఎత్తి చూస్తాడు)

శం: ఎక్కడ పెట్టావ్ ఫణీ అది?

ఫణి: (ఈపాటికి మంచం దగ్గరికి జరిగాడు. అనకోకుండానే) ఏమిటది?

శం: (మంచంకేసి చూస్తూ) నేనింతకు ముందు లోపలకు వచ్చినప్పుడు నీలం సూట్ కేస్ ఒకటి ఈగదిలో చూశాను. ఎక్కడో బాగా గుర్తులేదు గాని...

(మంచంమీద పడివున్న గుడ్డల్ని తొలగిస్తాడు. సూట్ కేస్ బైట పడుతుంది. అది తీసుకువెళ్ళి టేబులుమీద పెట్టి తాళం తడిమి చూస్తాడు)

తాళం చెవి వుందా ఫణీ?

ఫణి: నీకేమైనా పిచ్చెక్కిందా యేమిటి?

(శంకరం గోడ అల్మైరాలో వెదికి తీగ మేకు ఒకటి తెస్తాడు.)

శం: తాళం చెవిలేకపోయినా ఫర్వాలేదనుకో...

జా: (ఫణితో కటువుగా) పెట్టె ఎక్కడో మర్చిపోయానని నాతో ఎందుకు చెప్పారు. ఫణిగారూ మీరు?

(శంకరం తాళం తీసే ప్రయత్నంలో వున్నాడు.)

ఫణి: డోంట్ బీ ఏ ఫూల్, శంకరం! తాళం చెవి ఇక్కడెక్కడో వుండాలి ఇస్తానుండు. (జేబులు వెతుక్కుంటూ) పెట్టె నేనిక్కడకు తెచ్చిన సంగతి నాకు

★ మాతృక: ఫ్రెడరిక్ నాట్

అనుసరణ: ప్రఖ్యా శ్రీరామమూర్తి ★

సుత్తేలేదు ఇన్‌స్పెక్టర్! మనిషిని తిరుగుతున్నాను, మాట్లాడుతున్నానన్న మాటేగాని వావొళ్లు నాకు తెలియడం లేదు. రేప్పొద్దున పద్మ—

(మేకు తాళంలో బిగించి శంకరం గబిక్కున తిప్పుతాడు తాళం ఊడి వస్తుంది--)

శంకరం!

(శంకరం పెట్టె తెరుస్తాడు. పైన పరిచివున్న న్యూస్ పేపరు తొలగించి దానికింద నుంచి ఇరవయ్యో ఇరవైఅయిదో రూపాయి నోట్ల కట్టలు పైకి తీస్తాడు అవన్నీ ఒకదానిమీద ఒకటిగా బల్లమీద పేరుస్తాడు. ఇనస్పెక్టరు హాట్ తీసి మంచం మీదకు విసిరేసి బల్ల దగ్గరకు వెళ్ళి నోట్లు పరీక్షిస్తాడు.)

జా: రెండు వేలపైనే వున్నట్లున్నాయి ఎక్కడిదండీ మీ కీడబ్బు?

శం: ఇదెక్కడిదో నే చెప్పగలను ఇన్స్పెక్టర్! అసలిది ఇక్కడ ఈ గదిలో పద్మను హత్యచేసిన తర్వాత గజపతి అనే మనిషికి ఇవ్వాల్సినడబ్బు. కాని...అనుకున్నది అనుకున్నట్టుగా జరగలేదు. మీకు తెలిసిన సంగతేగా-చిన్న పొరబాటు జరిగిపోయింది. పద్మ బదులు గజపతి చచ్చిపోయాడు. కనక ఇక గజపతి కివ్వాల్సిన అవసరం లేకపోయింది. గత సెప్టెంబరు ఇరవై యొనిమిదినుంచీ ఈ డబ్బు ఇతని స్వంతమై పోయింది ఒక్కసారి ఇంతడబ్బు బైటపడితే అనుమానాస్పదమని కొస్త కొస్త ఖర్చు పెడుతున్నాడు!

జా: (ఫణితో) ఏమండీ?

శం; ఇంకొకుముందే గగు ఫణీ అన్నావ్, పద్మను రక్షించడానికి ఏం చెయ్యాల్సి వచ్చినా చేస్తానని? ఇంతలో నే మనసు మార్చుకున్నావా?

ఫణి: (ఇన్స్పెక్టరుతో) మీరు వచ్చే ముందు ఇక్కడో ప్రహ్మాండమైన నాటకానికి రిహార్సల్సు జరిగాయి ఇన్స్పెక్టర్. నేను మీదగ్గరకు వెళ్ళి మీ రెన్నడూ కనీ వినీ యెరగని అభూత కల్పన ఒకటి సృష్టించి చెప్పాలట! నేనట-నా భార్య అసహ్యం పుట్టించే దుర్ద్వేశంతో-ఎక్కడైనా తప్పుచేస్తే పరిదిద్దు శంకరం! - నా భార్య హత్యచేయించడానికి గజపతితో బేరమాడానట! అంతేకాదు - ఈ పెద్దమనిషి రాసిన ఈ త్తరం మీకు జ్ఞాపకం వుందికదూ - అది దొంగిలించింది గజపతి కాదట. అదికూడా నేనే తీసి దాచిపెట్టానట. ఆ రెండు ఆకాశరామన్న వుత్తరాలూ కూడా నేనే రాశానట. చివరికా దాచిపెట్టిన వుత్తరం తెచ్చి నేనే చచ్చిపోయిన గజపతి జేబులో వుంచానట!...

శం: (ఇన్స్పెక్టరుతో) ఆ దొరికిన రిబ్బన్లుకూడా—

ఫణి: ఆఁ ఆఁ - రిబ్బను. ఆ హంతకుడు ఉపయోగించిన ఉరితాడేదో మాయంచేసి ఆ రిబ్బన్లు నేనే బయట పడేశానట. ఎలావుంది ఇన్స్పెక్టర్ నావాఙ్మూలం?... ఏం శంకరం ఇంకేమిటి?

శంకరం హాలు తలుపు కేసి వెళ్లి అది తెరుస్తాడు]

[శం: (ఇన్స్పెక్టరుతో) తాళం చెవి ఈ బైటే ఎక్కడో పెట్టి పోతానని కూడా గజపతికి చెప్పాడండీ ఇతను!

[కిందా పైనా చూసి, తలుపు అంచులు కూడా తడిమిచూస్తాడు]

ఇదుగో బహుశా ఈ ద్వారబంధం మీద పెట్టివుంటాడు. దాంతో గజపతి తలుపు తెరుచుకుని లోపలకొచ్చి ఆ తెరల వెనక దాక్కున్నాడు. టైం చూసుకుని ఫణి థియేటరునుంచి ఫోను చేసి పద్మని పడక గదిలోంచి ఇక్కడకు లాగాడు...

[ఫణి మంచంమీద కూర్చుంటాడు]

జా: ఒక్కనిమిషం ఆగండి. గజపతి ఫణిగారి తాళంచెవితో నే లోపలకు వచ్చివుంటే అది అతని జేబులో నే మాకు దొరికివుండాల్సిందిగా. కాని దొరకలేదు అది ఏమైనట్లు? అదీగాక ఫణిగారు థియేటరునుంచి వచ్చిన తర్వాత తాళం చెవి లేకుండా ఇంట్లోకి ఎలా వచ్చి వుంటాడు?

[కొస్త అవకాశం]

శం: (చెప్పుకు పోతూనే ఆలోచిస్తూ) పద్మే తలుపు తీసి లోపలికి రానిచ్చి వుంటుంది. తర్వాత మీ రెవరూ రాకముందే గజపతి జేబులోంచి తన తాళం చెవి తీసుకుని వుంటాడు.

జా: కాని ఆయన మీతో వెళ్ళేటప్పుడు తాళంచెవి కూడా తీసుకునే వెళ్ళారని కోర్టులో నిరూపించబడింది. మీరు కూడా అలానే సాక్ష్యం ఇచ్చారు. జ్ఞాపకంలే?

[శంకరం పరాజితుడైనట్టు కనిపిస్తాడు]

ఫణి ఊఁ- ఎత్తు నీదే శంకరం. కానీ.

[శంకరం మళ్లీ వరండాలోకి వెళ్లి తలుపు అంచులు పైన, కింద తడిమి చూస్తాడు ఈ పని చేస్తూ ఈసారి మరీ అంత ధాటీగా కాకుండా మాటాడతాడు]

శం: నేను చూడకుండా ఇక్కడెక్కడన్నా పెట్టి వుండొచ్చు. గజపతి దాంతో తాళంతీసి హాల్లోకి ప్రవేశించకముందే మళ్ళీ తాళంచెవి అక్కడ పెట్టేసి వుండొచ్చు. అది తీసుకుని ఫణి—

జా: (విసిగి నట్లు మధ్యలో ఆపుతూ) ఆల్ రైట్ మిస్టర్ శంకరం! వినడానికిదంతా చాలా ఇంటరెస్టింగ్ గానే వుందిగానీ, మీవన్నీ చాలా ఫార్ ఫెచ్డ్ ఐడియాస్. పుస్తకాల్లో రాసినట్లు మాట్లాడతారు. ఇంతకీ ఆకేసు క్లోజయి పోయింది నేవచ్చిన సంగతి మటుకు ఇంకా అగమ్యంగానే వుంది.

శం: కాని, ఇది చావుబతుకుల సమస్యండీ బాబూ. కాస్త ఆలోచించి చూడండి

జా: ఇప్పుడు నే నాలోచించాల్సిందల్లా ఈ డబ్బు ఫణి గారికెక్కడి దన్న విషయం మాత్రమే నాకా ఒక్క సంగతీ తెలిస్తే చాలు, నే వెళ్ళిపోతాను.

[శంకరం తలుపు వేసేసి గబగబా బల్ల దగ్గర కొస్తాడు. సైడ్రాయరు తెరిచి దేని కోసమో వెతుకుతూంటాడు]

ఫణి: అకేమిటి? దేని కోసం వెతుకు తున్నావ్?

[శంకరం చెక్కు పుస్తకం బైటికి తీసి కౌంటర్ ఫయిల్స్ పరిశీలించి. ఉద్రిక్తుడై పుస్తకం ఇన్స్పెక్టరుకు చూపిస్తాడు]

శం: చూడండి-ఇతనుఆఖరుసారి బ్యాంకు లోంచి డబ్బు డ్రా చేసింది సెప్టెంబరు 27 వ తారీకున! అంటే హత్య జరిగిన నాటికి ముందు రోజన్నమాట! ఆ తర్వాత దమ్మిడీ డ్రా చెయ్యలేదు. ఈ నాలుగు నెలల నట్టీ ఏంపెట్టుకు తింటున్నాడు ఈ డబ్బుతో కాకపోతే?

[ఇన్స్పెక్టరు చెక్కు పుస్తకం తీసుకు చూస్తాడు]

ఇదుగో బ్యాంక్ ప్యాస్ బుక్ కూడా ఇక్కడేవుంది!

[డ్రాయర్లోంచి చిన్న బైండు పుస్తకం తీసి ఎంట్రీలు చూస్తాడు]

జా: (ప్యాస్ బుక్ తెరిచి చూస్తూ) ఎప్పుడూ పెద్దమొత్తం విత్ డ్రా చెయ్యలేదు మరి 80-75-100-120-50-80 110...... 120 కి మించి ఎప్పుడూ విత్ డ్రా చెయ్యలేదు.

[పుస్తకం బల్లమీద పడేస్తాడు.
శంకరం మళ్ళీ తీసుకు చూస్తాడు]

శం: కాని ఈ విషయం గమనించారా మీరు? రమారమి ప్రతి వారానికీ ఓసారి విత్ డ్రా చేశాడు. 100-120- 110-80- ఇదంతా ఓచోట కూడబెట్టి వుండొచ్చు.

ఫణి: అవునవును-చాలాయేళ్ళనుంచీ ఈ ప్లాను వేసుకు వుండొచ్చు నేను!

శం: (రేగిపోయి) మరెక్కణ్ణుంచి వచ్చిందోయ్ నీకింత డబ్బు ఒక్కసారిగా?

ఫణి: నిజంగా నీకు తెలుసుకోవాలని వుందా శంకరం?....(అతని వంకే సూటిగా చూస్తూ పెదవులు బిగబట్టి) తెలుసుకున్నందు వల్ల నష్టం చాలా వుంటుంది చెప్తున్నా.

శం: (చాలా నీచంగా) కమాన్.

ఫణి: (లేస్తాడు) సరే - కోరి కొరివితో తల గోకుతున్నావ్. పద్మ పరిస్థితి మరీ అధ్వాన్నం చేస్తున్నావ్! నే నారోజు రాత్రి ఇంటి కొచ్చేసరికి పద్మ గజపతి పక్కన మోకాళ్లమీద కూర్చుని అతని జేబులన్నీ గాలిస్తోంది. మాటిమాటికీ తనకేదో వాడి దగ్గరుందని అంటం సాగించింది. కాని అదేం దొరికినట్టు లేదు. మనిషికి అప్పటికే బాగా పిచ్చెక్కి పోయినట్టుంది. అందుకనే వెంటనే పోలీసు లొచ్చినా వాళ్లను దాంతో మాట్లాడ నియ్యలేదు నేను. ఆ పరిస్థితిలో నోటి కొచ్చిన అబద్ధమల్లా ఆడేసేది ఆ మర్నాడు పొద్దున ఈ డబ్బు చూపించింది. చూపించి ఏమన్నదో తెలుసా? పోలీసులు తన్ను పట్టుకెళ్ళడమే జరిగితే ఇదిమటుకు వాళ్ళ కంట పడనియ్య వద్దంది దాన్ని అరెస్టు చేసిన తర్వాత ఈ పెట్టె పెట్టె అలానే తీసుకెళ్ళిపోయి నేషనల్ బ్యాంక్ సేఫ్‌లో పెట్టించాను డబ్బు అవసరమైనప్పుడల్లా పెట్టె తీసుకుని కావాల్సిన డబ్బు తీసుకొని మళ్ళీ మరో బ్యాంకులోనో ఏ స్టేషను క్లోక్ రూములోనో deposit చేసే వాణ్ణి. ఇలా పిల్లి పిల్లల్ని తిప్పినట్టు వూరంతా తిప్పాను పెట్టె ఇది కనక మీకు కనిపిస్తే పద్మకి వున్న కాస్త ఛాన్సూ కూడా పోతుం దని తెలుసు నాకు. ఆ రోజు ఎందుకనో వాణ్ణి పొడిచి చంపేసింది గాని అసలాపూట ఈ డబ్బిచ్చి వాడి నోరు కట్టేద్దామని దాని వుద్దేశం!

జా: ఐతే ఈ బ్లాక్ మెయిల్ సంగతి మీ కప్పుడే తెలుసన్నమాట!

శం: ఎవరైనా ఈమాట నమ్ముతారనేనా నీ ఉద్దేశం?

ఫణి: చాలా తేలిగ్గా నమ్ముతారు గనకనే ఇన్నాళ్లూ చెప్పకుండా వూరుకున్నాను.

జా: ఊం...కోర్టు తీర్పుకి అనుకూలంగానే వుంది మరి మీరు చెప్పేది!

శం: ఇంతేనా మీరనగలిగింది? రేపు పద్మని ఉరిదీసేస్తున్నారండీ బాబూ!

జా: (విసుగ్గా) ఈ గొడవంతా నా చేతుల్లోంచి ఎప్పుడో దాటి పోయింది. విచారణ జరిగింది-అప్పీలు చేశారు-

శం: అవునులెండి. అసలు సంగతి బైట పెట్టటం మీకూ మంచిది కాదు అసలు ఖూనీ కోరుని వదిలేసి మరో అమాయకురాలికి ఉరిశిక్ష వేయించారని తెలిస్తే మీకుమటుకు అప్రదిష్ట కాదూ!

ఫణి: ఇదుగో - నువ్విహ ఇక్కణ్ణుంచి దయచెయ్యడం మంచిదనుకుంటాను.

## పంచ పాండవు లంటే...

ఓ బ్రహ్మాండమైన అభ్యుదయ సాంఘిక చిత్రం తీసేసి, దేశంమీద పారేసేసి, ఇతర నిర్మాతలకు ఆదర్శప్రాయుడు కావాలని చాలకాలంగా కలలుకన్న ఓ ఉత్సాహి ఏం చేశాడంటే—అభ్యుదయ చిత్రం తీద్దామనుకుని ప్రేమ కథ తీసుకుని, జానపద కథ రాయించి పౌరాణిక చిత్రం తీసిపారేశాడు.

శం: దయచెయ్యను మరీ! (గుమ్మందాకా వెళ్ళి ఆగి) కాని-నువ్వొక్క పొరపాటు చేశావ్! ఈ డబ్బు సంగతి పద్మతో చెప్తే ఏం చేస్తుందనుకుంటున్నావ్?

ఫణి: ఏం చేస్తుంది? తనకేం తెలీదంటుంది!

శం: తన వీలునామా కూడా మార్చవచ్చు.

[ఫణి నరాలన్నీ ఒక్కసారిగా బిగదీసుకు పోయినట్లుంటుంది శంకరం తలుపు తెరుస్తూ ఫణి వంకే సూటిగా చూస్తూ-]

పాపం! ఈ [illegible]గణమంతా వొర్తి పుణ్యానికి చేసినవాడి వౌతావ్! నిష్ప్రయోజనం నీ శ్రమంతా! బూడిదలో పోసిన పన్నీరు!

[శంకరం తన వెనకాలే తలుపు ధడాల్న మూసుకుని వెళ్ళిపోతాడు. ఇకనుంచీ ఇన్స్పెక్టరు ఫణితో చాలా మృదువుగా లాలిస్తున్నట్లు మాట్లాడతాడు. ఫణి అతని వైపు తిరుగుతాడు]

ఫణి: మావాడు చెప్పినకథ నేను కోర్టులో చెప్తాననుకోండి...ఎవరైనా నమ్ముతారంటారా?

జా: నిజం చెప్పాలంటే నామటుకు నాకేం నమ్మకం లేదుసార్. మీ భార్యని రక్షించుకోడానికి మీరు పడే తాపత్రయం చూసి కోర్టు నవ్వుకుంటుంది అంతే...పాపం మిమ్మల్ని చూస్తుంటే మటుకు నాకు చాలా విచారంగా వుంది.

[ఫణి పక్కమీద కూర్చుంటాడు]

ఫణి: వాడిప్పుడు పద్మని చూడటానికి వెళ్తాడనుకోండి లోపలికి పోనిస్తారా? అది...ఈ...ఈ...అంతిమసమయంలో... దానిమనసు మరీ వేధపడటం నా కిష్టం లేదు.

## ★ ఫణి ★

జా : మీలాయరుకి ఫోన్ చేసి చూడండి. అతను అడ్డుపడొచ్చు. (బల్ల మీదవున్న డబ్బు చూపుతూ) ఎవడో ఒకడు నిజంగా కాజేసే లోగానే ఆ డబ్బు మీరు జాగ్రత్తచెయ్యడం మంచిది

ఫణి : థాంక్స్. చేస్తాను

జా : (కోట్ రాక్ నుంచి హేట్ తీసుకుంటూ) అన్నట్టు—మీతో చెప్దామనుకున్నాను—పద్మావతి గారి వస్తువులు కొన్ని ఇంకా ఆ పోలీస్ స్టేషనులోనే వుండిపోయాయి—

ఫణి : ఏం వస్తువులు?

జా : ఏవో పుస్తకాలు—హేండ్ బ్యాగ్—అంతే ననుకుంటాను ఎప్పుడో అప్పుడు మీరు వెళ్ళి తెచ్చుకోండి వెంటనే ఇచ్చేస్తారు వాళ్లు

ఫణి : యు మీన్......రేపు ఐపోయిన తర్వాతనా?

జా : ఎప్పుడైనా సరే. ఇవ్వాళ వెళ్ళినా ఇస్తారు. ఫలానా అని చెప్పి అడగండి చాలు.

[ఇన్‌స్పెక్టరు హేట్ తీసుకుని చేత బట్టుకుని తన రెయిన్ కోటు కూడా తీసుకుని అది కుర్చీమీద పడేసి కుర్చీమీదవున్న ఫణి రెయిన్ కోటు తీసుకుని చేతిమీద వేసుకుని తర్వాత తన బ్రీఫ్ కేస్ కూడా చేతబట్టుకుని ఫణి దగ్గరకువచ్చి చెయ్యిజాపుతాడు]

వెల్, గుడ్ బై మిస్టర్ ఫణీ! ఇవాళ మళ్ళీ మనం కలుసుకోమనుకుంటాను.

ఫణి : (కరస్పర్శ చేస్తూ) గుడ్ బై ఇన్‌స్పెక్టర్. థాంక్స్.

[ఇన్‌స్పెక్టరు హాలు గుమ్మంలోంచి వెళ్ళిపోతాడు. వరండాలో అడుగులచప్పుడు కూడ వినిపించకుండా పోయేదాకా అలానే కూర్చుని పోయాడు ఫణి. ఆ తర్వాత గబగబా లేచి అల్మైరాలోంచి విస్కీ బాటిలు, గ్లాసు తీసి ఒక గుటక వేస్తాడు. నోట్లకట్ట ఒకటితీసి పేక ముక్కల్లా కలుపుతాడు. సూట్ కేసు తీసుకుని తాళం పరీక్షించిచూసి, మళ్ళీ మంచంమీద పడేస్తాడు. నోట్లకట్టలన్నీ ఓ న్యూస్ పేపర్లో చుట్టి పార్సిల్ చేసి చంకన పెట్టుకొని హాలుగుమ్మందాకా వెళ్ళి ఇన్స్‌పెక్టరుగారి కోటుతీసుకుని చేతిమీద వేసుకుని వరండాలోకివెళ్ళి తలుపు వేసేస్తాడు. తాళం క్లిక్ మని పడుతుంది.

వరండాలో దూరానికి పోతున్న అడుగులచప్పుడు...

ఒక్క క్షణం అవకాశం—

ఆ తలుపు తాళంలో తాళం చెవిపెట్టి తిప్పేనశబ్దం—తలుపు తెరుచుకుని ఇన్‌స్పెక్టరు లోపలికి వస్తాడు. గదిఅంతా ఓసారి కలయజూసి చేతిలోనికోటు, బ్రీఫ్ కేసు మంచంమీదపడేసి టెలిఫోను దగ్గరకువెళ్ళి ఒకనంబరు డయల్ చేస్తాడు.]

పోలీస్ : (రిసీవరులోంచి స్వరం వినిపిస్తుంది) ఖైరతాబాద్ పోలీస్ స్టేషన్!

జా : హలో గోవిందసింగ్! జాఫర్ స్పీకింగ్ హియర్—

గో : జీ హుజూర్.

జా : ఫణి ఇప్పుడే బైటికి వెళ్ళిపోయాడు. నేను మళ్ళీ లోపల ప్రవేశించాను. ఎవళ్లుండాల్సిన స్థానంలో వాళ్లంతా వున్నారు గదూ?

గో : తుచ తప్పకుండా సర్.

జా : ఆల్ రైట్, కేతిగాడెవడూ రంగంలోకి దూక్కముందే పాత్రల్ని ప్రవేశపెట్టించు. ఆ క్యూ టైం లేదు అంతా తొందరగా జరిగిపోవాలి.

గో : యస్ సార్.

[ఇన్స్‌పెక్టరు ఫోను దించేస్తాడు ఫణి బ్యాంకు పుస్తకంకోసం అటు యిటూ చూస్తాడు. చివరకు అది కనిపిస్తుంది అది తీసుకుని అతనుమళ్ళీ పరిశీలిస్తూండగా తెరల వెనక తోటతలుపులు బలవంతంగా తెరచుకున్న చప్పుడు వినిపిస్తుంది ఇన్స్‌పెక్టరు గబగబా వంటయింట్లోకి వెళ్తాడు. ఎవరో తలుపులు తోసుకుని తెరలు ఒత్తిగించుతారు బైటనుంచి సూర్యకాంతి కాంతి వెంటనే లోపలకు చంగున గంతువేసి వస్తుంది. దాంతోబాటు శంకరం ప్రవేశిస్తాడు. సరాసరి టేబులుదగ్గరకు వెళ్లి దేనికోసమో గబగబా వెతుకుతాడు. ఇన్స్‌పెక్టరు వంటయింట్లోంచి వస్తాడు.]

జా : వెల్. మిస్టర్ శంకరం!

[శంకరం ఉలిక్కిపడి తలయెత్తి చూస్తాడు.]

శం : ఆ బ్యాంక్ ఎక్కౌంట్ ఏదీ?

జా : దానిసంగతి మీకనవసరం. ముందు మీ రిక్కణ్ణుంచి వెళిపోవాలి-తక్షణం.

శం : (గొంతుస్థాయి హెచ్చించి) మీ దగ్గరుందా అది?

జా : ష్-కాస్త మెల్లగా. ముందు నువ్విక్కణ్ణుంచి వెళ్లిపోతావా లేకపోతే ప్రైవేట్ ప్రెమిసిస్ లోకి ఇల్లీగల్‌గా జొరబడ్డందుకు అరెస్టు చెయ్యమంటావా?

శం : నన్ను బెదిరించకండి. నాకూ లా తెలుసు. అసలు మీరు లోపలికి రావడానికి మటుకు మీదగ్గర సెర్చివారంటేదీ?

జా : (బాగా కోపంవచ్చిందిగాని, అరవకుండా వుంటానికి విశ్వప్రయత్నం చేస్తూ గొంగిస్తాడు. Shut up! తప్పనిసరి (ప్రాధేయపడుతున్నట్టు) పద్మావతి గార్ని రక్షించాలని నీ కేకోశానైనా వుంటే నువ్వు నోరుమూసుకుని ఈ వ్యవహారం నా కొదిలెయ్యవయ్యా మహాశయా!

శం : నీకా!?

[వీధి గేటు తెరిచిన కిర్రుచప్పుడు...వరండాలో ఎవరో నడిచివస్తున్న సవ్వడి... ఇన్స్‌పెక్టరు శంకరాన్ని నిశ్శబ్దంగా వుండమని సంజ్ఞచేసి హాలు తలుపువైపు నిర్దేశిస్తాడు.]

జా : ష్...

[ఇద్దరూ గుమ్మంకేసే చూస్తూ నిశ్చలంగా నిలబడిపోతారు. ఎవరో తాళంలో చెవిపెట్టిన అలికిడి...ఒక్క క్షణం నిశ్శబ్దం... తలుపు ఎవరో తట్టుతారు...ఒక్కరవ్వ అవకాశం ... మళ్ళీ తలుపు తట్టుతారు...శంకరాన్ని ఏమాత్రం కదలవద్దని ఇన్స్‌పెక్టరు చెయ్యెత్తి సూచిస్తాడు...మళ్ళీ అడుగులచప్పుడు దూరంగా వెళ్లిపోతుంది. వీధి గేటు మళ్ళీ వేసినట్టు కిర్రుచప్పుడు. ఇన్‌స్పెక్టరు ఏదో భారం దిగినట్టు ఊపిరి వదుల్తాడు]

జా : హబ్బ! అసలు అందరికంటే ముందు నిన్ను లాకప్‌లో వుంచాల్సింది నేను. ప్లానంతా నాశనమయ్యేది కాస్తైతేనూ—!

శం : ఏమిటండీ ఈ గొడవంతా?

జా : (కడుపుమంటతీరా) నాలుగు పుస్తకాలు చదివి, సినిమాలు చూసి, మా కేసులు నాలుగు స్టడీ చేసి, మిడిమిడి జ్ఞానంతో తగుదునమ్మా అంటూ అపరాధ పరిశోధనకి బయల్దేరే మీలాటి గంధారిగాళ్లు మా వ్యవహారాల్లో వేలెట్టకుండా వుంటే చాలు, మా విధులు మేం సక్రమంగానే నిర్వహించుకోగలం!

[తెరచివున్న తోట గుమ్మందాకా వెళ్ళి అక్కణ్ణుంచి తోటలోకి చూస్తూ నిలబడతాడు హఠాత్తుగా వెనక్కి తగ్గి శంకరాన్ని కూడా పక్కకు తప్పుకోమని చేత్తో సౌజ్ఞలు చేస్తాడు. కొన్ని క్షణాల అనంతరం తోటలోంచి పద్మ ప్రవేశిస్తుంది ఆమె వెనకే యూనిఫారంలో వున్న పోలీసు కానిస్టేబులు కూడా ఒకడు వస్తాడు పద్మ రెండో అంకం చివర ఏ దుస్తుల్లో వుందో అదే దుస్తులో [illegible]టుంది. అనాటి చేతి సంచీయే చేతిలో వుంది లోపలున్న మనుషులిద్దర్నీ చూసి ఆమె గుమ్మంలోనే ఆగిపోతుంది. యనిషిని చూడగానే గత మూడు నాలుగు నెలలోనూ అమితంగా వ్యధ చెందినట్లు కనిపిస్తుంది. అంతా అగమ్యగోచరంగా వున్నట్టు—శూన్యంలోకి చూస్తున్నట్లు ఆమె చూపులు అర్థవిహీనంగా ఏం అర్థం కానట్టుగా వుంటాయి]

పద్మ : శంకరం

శం : పద్మా! (ఆమెను సమీపిస్తాడు)

పద్మ : వారేరీ?

శం : అతను—అతనిప్పుడే ఎక్కడికో వెళ్ళాడు.

పద్మ : ఇప్పుడొచ్చేస్తారా మళ్ళీ?

జా. ఖచ్చితంగా చెప్పలేం.. ఆల్ రైట్ జలాల్.

[జలాల్ శాల్యూటు చేసి, వచ్చిన దోవనే వెళ్ళిపోతాడు]

ఇందాక తలుపు తట్టింది మీరేనా?

(ఇంకా వుంది)

# ఎకానమీ

సిగరెట్ నోట్లో పెట్టుకుని, వారపత్రిక తిరగవేస్తూ. భార్య కట్టిఇచ్చిన తాంబూలంతోపాటు కొంతజర్దాకూడా బిగించి, దానికోపక్క బుగ్గలో ఆశ్రయమిచ్చి, ఈజీ ఛైరులో ఆసీనుడైవున్న కృష్ణారావుని "ఏమండీ!" అంటూ, పనులుముగించి తడిచేతులు చీరెకితుడుచుకుంటూ, అతనిభార్య శ్యామల పిలిచినపిలుపు, ఇహంలోకస్ఫురణ కలిగించి, పుస్తకాన్ని మూయించి, ఆవిడగారివైపు అరమోడ్పుగా వీక్షించేలా చేసింది

"ఏమిటండీ?"

"ఫోకరూ! ఎప్పుడు ఏ విషయం మాటాడదామని దగ్గరచేరినా ఇలాగే అంటారు"

కోపంనటిస్తూ ప్రక్కనున్న మరో కుర్చీలోకూచుని, సాలోచనగా వేలికొనకు చీరచెరగును మెలివేయ సాగింది.

"సెలవియ్యండీ"

అని అతను మళ్ళా అన్నాడు. శ్యామల ఓకోరచూపు చూసింది, చిరుకోపంతో

"వేళాకోళంకాదు ఏదైనా సీరియస్‌గా చెప్పేటప్పుడు శ్రద్ధగా వినాలి. మీరుచెప్తే నేను విననూ? లేకపోతే నేనసలు చెప్పేదే లేదు నాకొక్కదానికే కాదుగా సంసార తాపత్రయం పట్టింది? వినకపోతే జరిగే దేదో జరుగుతుంది."

నిర్లక్ష్యంగా అంది. కృష్ణారావు వారపత్రికను పక్కనున్న బల్లమీదపడేశాడు.

"విన్నవించుమంటే అంత కోపమెందుకండీ?"

"ఎందుకూ అనవసరంగా ఆ గౌరవ వాచకం ప్రయోగిస్తారు, వ్యంగ్యార్థం కాకపోతే? 'చెప్పేదేదో చెప్ప అదేలాగా జరగదులే' అనడం అన్నమాట"

కోపంలోనే చిరునవ్వు, చూచాయగా మొహంపైన మెరిసి మాయమైంది—'కనిపెట్టేశాను మీ లోగుట్టు; తెల్సుకోండి, నా ప్రభావం' అన్నట్టు.

"ప్రేమలో గౌరవవాచకం వాడినా తప్పలేదు. అదీగాక స్త్రీలకు సమాన హక్కులు కావాలంటున్న ఈరోజుల్లో 'ఏమండీ' అని భార్యల్ని పిలవడం సంస్కారవంతుల కనీస ధర్మం" కృష్ణారావు గుక్కతిప్పుకోకుండా చెప్పసాగాడు.

"ఆపండి ఆ ఉపన్యాసం తక్కిన స్త్రీల విషయం నాకు తెలీదుగాని, నేనుడిపుణ్యమా అని నన్ను అలాపిలవకండి మీ పెద్దలకో నమస్కారం"

"ఇంతకీ నీవనేదేమిటి?"

"మీ రననిస్తేగా?"

"అనమనే అనేది"

"విని వొప్పుకుంటానని మాటఇస్తారా?"

"ఏంటే కద?"

"వింటాగా?"

"అసలు విషయమేమిటో?"

"మన కుటుంబం సంగతే!"

"విని, వీలుంటే వొప్పుకుంటాను"

"అగుగో, మళ్ళీ షరతులు పెడుతున్నారు?"

## శాంతి కృష్ణమూర్తి

"అది నాకసాధ్యమైనదైతే?"

"అసాధ్యమైనది నేనెందుకడుగుతానండీ! ఏమన్నా పిచ్చిదాన్ననుకున్నారా?"

"అయితే చెప్పు"

"చేస్తారుకదూ?"

"చేస్తా...వీలుం..."

"ఎల్లుండి అమ్మాయి పుట్టిన రోజు పండుగ ఆరోజు వూళ్ళో అందర్నీ పేరంటానికి పిలవాలనివుంది మీరు కొట్లో ఖాతాపెట్టో, అప్పుతెచ్చో దానికోగౌను, ఒకవీశె నెయ్యి, ఒకవీశె చక్కెర, శేరు సెనగపిండి, జీడిపప్పు, కిస్‌మిస్ వగైరా తేవాలి. ఎల్లుండికి రెండురూపాయల సెనగలూ, ఓ వంద తమలపాకులూ, నాలుగు డజన్ల అరటిపళ్లూ కావాలి"

"చాలా పెద్ద పద్దే వుందే? ఈ నెలా ఖర్చుతో ఇంత లిస్టుని పూర్తి చెయ్యడమెట్లా? దానికి ఏడేళ్ళొచ్చాయికదా, ఇంకా పుట్టినరోజు పండుగ లెందుకూ?"

"అన్నారూ? నేను అలా అంటారనే అనుకున్నాను. డబ్బు ఖర్చవుతుందని పండుగా, పబ్బమూ మనేసుకుంటామండీ? షష్టిపూర్తి అయినా పుట్టినరోజు పండుగలు చేసుకుంటున్నారే, పది రూపాయల ఖర్చుకోసం వద్దంటున్నారా?"

శ్యామల ప్రాధేయపూర్వకంగానే అంది.

"రూపాయలకోసం కాదు; అసలు నాకు పుట్టిన రోజు పండుగల్లోనే నమ్మకం లేదు"

"ఎలుండి అమ్మాయి పుట్టినరోజు కాదంటారా?"

"అవ్వచ్చు"

"అయితే దానిలో నమ్మకం లేకపోవడమేమిటి?"

"పుట్టిన రోజులో కాదు; పండుగలో లేదన్నా."

"అదేం వీల్లేదు ఇది ఆడవాళ్ళ విషయానికి సంబంధించినది. ఆ మాత్ర స్వయం నిర్ణయాధికారం మాకూ వుంది మీరు చెప్పిన పరకులు తెచ్చిపడేయండంతే!"

"నెలాఖరులో పది రూపాయలు మాత్రం?"

"[illegible] చెయ్యండి"

"తీర్చే విధానం?"

"ఎలాగో అలా తేండి. మీకు ఆవేళ రాత్రే ఆ డబ్బు ఇస్తాను, సరా?"

"ఎట్లా ఇస్తావ్?"

"మీరే చూద్దురుగాని"

"అయితే సరే"

అప్పటికి శ్యామల మనస్సు కుదుటపడింది. దీర్ఘంగా నిట్టూర్చింది

"ఎందుకా నిట్టూర్పు?"

"ఎంతగా వాదించారు-అంతా నా మేలు చేస్తున్నట్టు"

"నా కిష్టంలేక కాదు-బడ్జెట్ లేదుగా" చిరునవ్వునవ్వాడు; విషాదకరంగా.

శ్యామలా నవ్వింది "ఇండియా ఆర్థిక మంత్రిత్వ స్థానం ఖాళీ అయింది ఆ స్థానం సంపాదించండి-మీ చేతినుండి డబ్బు రాలక పంచవర్ష ప్రణాళిక పడుక్కుంటుంది"

"ఏమో దశ ఎలా మారుతుందో? ప్రస్తుతము ఐ ఎ ఎస్ కి కడుతున్నాంగా?"

ఇంతలోకి అమ్మాయి నిద్రలో కలవరించ సాగింది. శ్యామల లేచివెళ్ళి, జోకొడుతూ

# వహీదా రెహ్మాన్ ఎల్లప్పుడూ

# లక్స్ టాయ్‌లెట్ సబ్బును

## ఉపయోగించును. "అది ఎంత తెల్లనిదో

## అంత శుద్ధమైనది"




సినిమా తారలు తమ చర్మమును మనోహరముగాను, మృదువుగాను ఉంచుకొను విషయమందు అధికమైన శ్రద్ధ వహించవలెను. ప్రవీణురాలైన భరత నాట్య నర్తకి మరియు పురోవృద్ధి గాంచుచున్న సినిమా తార, వహీదా రెహ్మాన్, తన చర్మమును మృదువుగాను, పరిమళముగాను, ఉంచుకొనుటకు లక్స్ టాయ్‌లెట్ సబ్బునే ఉపయోగించును.

**సినిమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు**

* గురుదత్‌గారి
"ప్యాసా" చిత్రంలో
సినిమా తార

LTS 491-X52 TL

భారత దేశంలో తయారుచేయబడినది

# ★ ఏకాదశి? ★

Title as printed: ఎ కా న వి ా

"నే చూస్తాన్లే, అమ్మా, నీ పుట్టినరోజు పండుగ. ఎందుకు జరగదో?...ఏమండోయ్, ఆ లైట్ ఆర్పండి, అమ్మాయికి దోమలు కుడుతున్నాయి" అంది.

"చిత్తం, దేవిగారూ" అంటూ కృష్ణారావు లేచాడు. శ్యామల మనస్సులో నే నవ్వుకోసాగింది.

* * *

పుట్టిన రోజు పండుగ దివ్యంగా జరిగింది. ఆ వేళ సాయంత్రం ఇంటినిండా వనితా లోకం వుంటుందని ఆఫీసునుండే బజారు వైపు వెళ్ళాడు కృష్ణారావు

అతను తిరిగి తిరిగి వొచ్చేటప్పటికి ఎనిమిదైంది. ఇల్లంతా సుగంధ ద్రవ్యాల్తో గుబాళిస్తోంది అక్కడక్కడ రాలిన అక్షింతలూ, సెనగలూ పేరంటపు వైభవాన్ని చాటుతున్నాయి.

శ్యామల సిల్కు బట్టలు వొదల్లేదు. అతని దుస్తుల్ని అంగుళుని స్వాంతుకి తగిలించింది

"అమ్మాయి, నాన్నారికి దణ్ణంపెట్టా! అంటూ చూసి చూసి నిద్దరోయింది" అంది శ్యామల, తను నమస్కరిస్తో.

నువ్వెందుకు నమస్కరించడం నీ పుట్టిన రోజు కాదుగా" అన్నాడు కృష్ణారావు

"నా కూతురి బదులు"

భోజనం దగ్గర ప్రత్యేకమైన మిఠాయి. పాతాళించిన సెనగలూ, అరటిపండ్లతో అనుకోకండా నే ఎక్కువ తిన్నాడు కృష్ణారావు.

పనులు పూర్తి చేసుకొచ్చాక శ్యామల, "మీకెంత ఖర్చయిం దన్నాగు?" అని అడిగింది.

"11—14—0"

"అయితే ఈ 12 రూపాయలూ తీసుకోండి. మీరు అమ్మాయి పుట్టిన రోజు పండక్కి ఏమీ ఖర్చు పెట్టలేదని జ్ఞాపకముంచుకోండి" అంది సగర్వంగా.

"ఎక్కడిదీడబ్బు?"

"పేరంటాళ్ళిచ్చారు. ఇదిగో మరో అయిగు"

"ఎందుకు తీసుకున్నావ్?"

"అమ్మాయికి ప్రెజెంట్ చేశారు"

"భాగానే వుంది; ఐగు రూపాయలు అదా అన్నమాట మంచి ఏకాదశియే" అన్నాడు కృష్ణారావు నవ్వుతో.

* * *

"మరో సంవత్సరం గడిచింది. అమ్మాయి పుట్టిన రోజు రేపనగా కృష్ణారావు 'భార్య ఆ విషయం అడుగదేమా?' అన్న ఆలోచనలో పడ్డాడు.

చూసిచూసి చివరికి అతనే అన్నాడు:

"రేపు అమ్మాయి పుట్టినరోజు జరపవూ?"

"జరుపుతాను"

"సెనగలూ, మిఠాయీ, గౌనూ అన్నీ బజారులో నే కొని తెస్తానులే"

"అవేం వొద్దులెండి ఒక్క గౌను తెస్తే చాలు."

"ఏం," అలా అంటున్నావ్? ఇందులో మనకేమీ తగిలేదిలేదుగా. పేరంటాళ్లనుండి బాగానే వసూలౌతుందికదూ" ఉత్సాహంతో కృష్ణారావు మరీమరీ హెచ్చరించసాగాడు

"వద్దన్నాగా"

"ఇకే ఆడవాళ్లతో చిక్కు. అవునంటే కాదంటారు, కాదంటే అవునంటారు"

"మీకు తెలీకు ఊరుకుందురూ?"

"అలా వీల్లేదు దాని పుట్టినరోజు పండుగ చేసి తీరాల్సిందే?"

"వద్దుబాబూ వద్దు"

"ఏం ఎందుకు వద్దు? అమ్మాయి మీద నాకు ప్రేమ లేదనుకున్నావా! నిజుడు ఎదో తమాషాకన్నానంతే-నీహృదయం కనుక్కుందామని. అంగుళల రేపు పొద్దున్నే వెళ్ళి అందర్నీ పిలిచి పండుగ మామూలుగా చెయ్యి. నేను అన్నీ తెచ్చిపడేస్తాను"

"ఈ లిస్టుచూసి మరీమాట్లాడండి" అని శ్యామల ఓ కాగితం అందించింది. కృష్ణారావు చదువుకుని వివరు వవసాగాడు. చివరికి కాగితం కింద వొదిలేశాడు, కుర్చీలో కూలబడుతూ.

"ఏమంటారు?" అంది శ్యామల.

"నరేలే నీయిష్టం" అని కృష్ణారావు చప్పబడ్డాడు.

ఆ కాగితంలో ఇలావుంది —

| | |
|---|---|
| డిప్టీకలెక్టరు గారింట్లో పేరంటంలో ఇచ్చినవి ... ... | 5-0-0 |
| తహశీల్దార్ ... ... | 5-0-0 |
| హెడ్‌మాష్టర్ ... ... | 5-0-0 |
| అసిస్టెంట్ సివిల్ సర్జన్ ... ... | 5-0-0 |
| లేడీ డాకర్ ... ... | 3-0-0 |
| ఇతరస్నేహితురాళ్ల ఇళ్ళల్లో... | 20-0-0 |
| మొత్తం. ... | 43-0-0 |
| మనకువచ్చినది.— | 17-0-0 |
| నెరసి నష్టం. | 26-0-0 |

"అమ్మాయికి ఓగౌను తెండి చాలు. మన ఇంట్లో నే జరుపుకుందాం పుట్టిన రోజు పండుగ సరదాగా" అంది శ్యామల ఓగార్పుగా.

★

# గృహిణీ ప్రణయం

## ప్రాచీన గాథాలహరి

గత సంచిక తరవాయి

౪

బాలచంద్రిక, విజ్జిక వెళ్ళిపోయిన పది పదిహేను రోజుల దాకా ఇందుశర్మకు వారిద్దరు ఇంటిలో లేని లోటేమీ కనిపించలేదు. కాని ఇంకొక పదిహేను రోజులు గడిచిపోయేసరికి అతని కిల్లంతా బాగా వెలితిగా కనబడింది. దీపదీపాలవేళ దీపాలు వెలిగించకపోయినా బాలచంద్రిక ఆ భవంతి కంతటికీ ఒక దీపంలా కనిపించేది. విజ్జిక ఆ వధూవరు లిద్దరికీ ఏ లోపము రాకుండా అనుక్షణము కనిపెట్టుకుని ఉండి, అనేక విధాలుగా పరిచర్యలు చేస్తుండేది. వారిద్దరు వెళ్ళిపోగానే ఇందుశర్మకేగాక ఆ ఇంటి పరిచారికల కందరికీ ఆ భవంతి అంతా బాగా చిన్నబోయినట్టు కనబడింది. బాలచంద్రిక వెళ్ళిపోయిన కొత్తలో వారిలో వారనేక విధాలుగా గుసగుసలాడుకొన్నారు.

ఒకనాటి ఉదయం వారిలో ఒక దాసి చేతులు తిప్పుకుంటూ ఇంకొక దాసి చెవిలో నెమ్మదిగా ఊదింది:

"అమ్మాయి కత్తిమామల ఒద్దిక, ఆడబడుచుల పోరు ఉండదని మహా మురిసిపోయారు. సిరిసంపద లున్నవాడనీ, చక్కనివాడనీ ఈడు, జోడు బాగున్నదనీ ఎంతో సంబరపడ్డారు. చూశావా? చివరికా అమ్మగతి ఏమయిందో! కాస్త పెద్ద దిక్కంటూ లేకపోతే, చివరి కిలాగే అవుతుంది! భాగ్యభోగ్యా లుండగానే సరా?"

రెండవ దాసికీ ధోరణి అంతగా నచ్చలేదు: కొంతసేపటి కామె తప్పంతా బాలచంద్రికదే అన్న ధోరణిలో పడింది:

"కాకపోయినా ఆ అమ్మ కంత మిడిసిపాటు కూడదమ్మా! తన తండ్రి దండనాయకుడనేనా ఆ మిడిసిపాటంతాను!... పోనీ ఆయనవల్ల ఏదో కొంచెం లోపం ఉన్నదనే అనుకుందాము. అంతమాత్రానికే దాదిని వెంటబెట్టుకుని ఇక ఎవరితోను చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోవాలా? నలుగురూ వింటే ఏమనుకుంటారు?...ఏమో నమ్మా! నా కిదేమీ నచ్చలేదు సుమీ!" అని ఈసడించివేసింది. కాని మొదటి దాసి అంతటితో విడిచిపెట్టలేదు:

"అయితే ఏం చెయ్యమన్నావు! అర్ధరాత్రి వేళ వచ్చినా, అపరాత్రి వేళ వచ్చినా కిక్కురుమనకుండా బిక్కు బిక్కుమంటూ ఒక్కత్తినీ పడి ఉండమన్నావా?"

"ఆడజన్మ ఎత్తిన తరవాత కట్టుకున్నవాడేమి చేసినా పడిఉండవలసిందే!"

"అది మనలాంటి వాళ్ళకేగాని కాస్త పెట్టిపుట్టిన వాళ్ళకంతటి న్యూనత పడవలసిన అవసర మేమిటే?" అని మొదటి దాసి ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. సరిగా అదే సమయంలో ఇందుశర్మ ఏదో అవసరం ఉండి అక్కడికి వచ్చాడు.

అతనికి వారి మాటలు కొంచెం అస్పష్టంగా వినిపించాయి. అతని అలికిడి గమనించి ఆ పరిచారిక లిద్దరూ తమ సంభాషణ విరమించివేశారు.

ఇందుశర్మకు వారి సంభాషణ వినగానే కొంచెం కోపమే వచ్చింది. అతడా విషయంలో తన తప్పేమీ లేదని అనుకొన్నాడు. అది కొంతవరకు నిజమే.

ఇంతవరకు చంద్రరేఖతో అతనికి నలుగురు అంతగా ఆడిపోసుకోవలసినంత సన్నిహిత సంబంధమేమీ ఏర్పడలేదు.

చంద్రరేఖ నృత్యమన్నా, వీణా గానమన్నా అతడు చెవికోసుకునేమాట నిజమే. ఇంకా ఇతర గాయనీమణుల గోష్ఠీ వినోదాలున్నా అతడెక్కువగా చంద్రరేఖ నృత్యోత్సవాలలోనే ప్రత్యక్షమయ్యేవాడు.

ఆ ఉత్సవ తన్మయతలో పడితే అతనికి ఎంతరాత్రి గడిచిందీకూడా తెలిసేదికాదు. అందుచేతనే ఇందుశర్మ బాగా రాత్రి పడేదాకా ఇంటిముఖం పట్టేవాడుకాదు. కొంతకాలానికతనికి చంద్రరేఖమీద కొంత మక్కువ, ఆప్యాయత ఏర్పడిన మాట నిజమే. అయితే ఆ వ్యవహారం అంతకంటె ఎక్కువ ముదరలేదు.

కాని ఇరుగుపొరుగువారంతా 'అదిగో పులి అంటే ఇదిగో తోక' అనడం మొదలుపెట్టారు. వారి గుసగుసలన్నీ ఇందుశర్మ భవంతి పరిచారికలదాకా పాకిపోయాయి. క్రమక్రమంగా అవి విజ్జిక చెవిలోను, బాలచంద్రిక చెవిలోను పడ్డాయి. విజ్జిక అదంతా వినీవిననట్టుగా మాట్లాడకూరుకుంది. కాని బాలచంద్రిక రోషం నానాటికీ హెచ్చు పెరిగిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన తరవాత ఇందుశర్మకావిషయంలో ఒక గట్టిపట్టుదల పట్టుకుని పీడించింది:

"నావల్ల తప్పేమీ లేనిదే ఆమె అంత దురుసుగా పుట్టింటికెందుకు వెళ్ళిపోవాలి? నిజానికి బాహాటంగా వారకాంతల వెంట తిరిగే భర్తలంటే భార్యలు హడిలిపోతూ అగ్గగ్గలాడుతూ ఉంటారు! ఏమీ లేకపోతేనే ఇలాంటి అనుమానాలు పెట్టుకుని ప్రాణాలు కొరుక్కుతింటారు! ఎలాగా నేను నలుగురి నోళ్లలోను పడ్డానుగదా! ఇంక భయమేముంది? నా ఇష్టం వచ్చినట్టుంటాను!"

ఇందుశర్మ సంకల్పం ఆ విధంగా సాగిపోయింది. బాలచంద్రిక వెళ్ళిన పిమ్మట క్రమక్రమంగా నెలరోజులు గడిచిపోయాయి. అయినా అతడామెను తిరిగీ పంపించవలసిందని మామగారిని ప్రార్థించలేదు. కేవలం తన క్షేమసమాచారం మాత్రమే తెలియజేస్తూ మాటవరస కొక తాళపత్ర లేఖ వ్రాసి, పరిచారకునిద్వారా అది ధాన్యకటకానికి పంపించాడు.

బాలచంద్రిక పుట్టింటికి వెళ్ళి భర్త తనయెడల కనబరిచిన అనాదరణ అంతా తల్లి చెవిలో నూరి పోసింది. ఆమె అదంతా విని గుడ్ల నీరుగుక్కుకుంది:

"ఏదో ఇంత కలిగినవాళ్లు గదా అని నేనే ఆ సంబంధం చెయ్యాలని పట్టుబట్టాను. చిన్నతనం మూలాన్ని అతనివల్ల ఏదైనా కొంచెం పొరబాటే జరిగిందనుకో. అయినా నీవంత పంతం పట్టడం కూడదమ్మా! కొంచెం ఓపికపట్టి ఎలాగో అలాగ అతన్ని వశపరుచు



దసరా ఉత్సవాలలో మైసూరు రాజభవనం

కోవాలి. అంతేగాని ఇలాగ తొందరపడ కూడదమ్మా!"

అని కొంచెం సర్ది చెప్పింది. కాని బాలచంద్రిక చిన్నప్పటి నించీ బాగా అల్లారు ముద్దుగా పెరిగింది. అందులోను తల్లి దగ్గర ఆమెకు మరింత చనువు. అందుచేత బాగా కొండెక్కి కూర్చుంది:

"ఆయన నన్నలాగ తీసి పారేస్తుంటే నే నెంత బతిమాలుకుంటే మాత్రం ఏ లాభం? ఆయనే స్వయంగా వచ్చి బతిమాలుకుంటే గాని నేనిక ఆ యింట్లో అడుగుపెట్టను!"

అని బుసి బుసి దీర్ఘాలు తీసే ధోరణిలో పడింది. తల్లి అది చూచి ఇక ఏమన్నా లాభం లేదని అప్పటికి మాట్లాడ కూరుకుంది.

కాని వెంటనే ఆవిషయం భర్తతో చెప్పకుండా ఉండ లేకపోయింది. మహేంద్ర పులమావి కిప్పుడు భార్య ఎదట తన దూర దృష్టి, విజ్ఞత వెల్లడించడానికి కొక చక్కని సాకు దొరికింది. వెంటనే అందుకొన్నాడు:

"నేను మొదటి నించీ చెబుతూనే ఉన్నాను. వాళ్ల అక్షయ సౌభాగ్యాలు మంచివి కావని! నీవు నామాట చెవి కెక్కనిచ్చావూ? చేజేతులా చేసినదంతా అనుభవించు. ఇప్పుడు నే నేం చెయ్యగలను? అందుకనే స్త్రీ బుద్ధిః ప్రళయాంకరి! అన్నారు"

అని తన అహంకారం అంతా ఆమె ఎదట వెళ్ళబోశాడు:

అప్పటికా ప్రస్తావన ఆగిపోయింది గాని ఆ తరవాత మహేంద్ర పులమావి ఆ విషయం లోతుగా ఆలోచించి బాలచంద్రిక నెలాగైనా తిరిగి అత్తవారింటికి పంపించడమే మంచిదని నిశ్చయించాడు. భార్య కూడా అదే మంచిమార్గమని వంతపాడింది.

అప్పటికి ఇందు శర్మ పంపించిన లేఖ వారికి చేరింది. దానిలో బాలచంద్రిక ప్రత్యేక ప్రసక్తేమీ లేదు. ఊరికే మూకుమ్మడిగా అందరి క్షేమ సమాచారాలు తెలియజెయ్యవలసిందని మాత్రమే ఉంది. అది చూచి బాలచంద్రిక లోలోపల కుమిలి పోయింది.

అటు పిమ్మట తల్లి ఒకనాడామెను తిరిగి అత్తవారింటికి పంపించే ప్రస్తావన తెచ్చింది. కుమార్తె తలవంచుకుని మాట్లాడకూరుకుంది. అంతేగాని అవునని గాని కాదని గాని సమాధానం చెప్పలేదు. తల్లి కొంచెం నిర్బంధించింది. కుమార్తె రుసరుసలాడింది:

"మాకా నా? ఆయన మాట వరసకయినా నన్నక్కడికి పంపించమని కబురు పంపలేదు. అలాంటప్పుడు నే నక్కడికి వెడితేమాత్రం ఏలాభం చెప్పు."......

ఇక నేను మీకు కూడా బరువయితే అల్లాగే వెళ్ళిపోతాను. ఇక నా కర్మ ఇంతే. పూర్వ జన్మలో నేనింతే పెట్టిపుట్టాను"

అని పైటచెరగుతో కళ్ళు తుడుచుకోవడం మొదలు పెట్టింది. ఆ పరిస్థితిలో తల్లికిక ఏమనడానికీ పాలుపోలేదు. అంతలో విజ్ఞక అక్కడికి వచ్చింది:

"వెళ్ళనుగాక వెళ్ళనంటే బాలచంద్రిక నెందుకు బలవంత పెడతారు? నేనున్నానుగా, మీ కెందుకా భయం. ఎప్పుడో మళ్ళీ కాస్త బుద్ధి తిరక్కపోతుందా? అప్పుడు పంపించవచ్చును లెండి. నేను బాలచంద్రికతో కూడా నే వెడతానుగా. అమ్మాయి కేలోపము రానివ్వను లెండి. ప్రస్తుతానికిక బలవంత పెట్టకండి!"

అని సమాధాన పరిచింది. ఆ పైన తల్లి మరి మాటాడలేదు. మహేంద్ర పులమావి

ఇందు శర్మ లేఖ చూచి బాగా చిరచిరలాడాడు. ప్రత్యుత్తరం రాయకపోవడం బాగుండదని ఏదో అంటీ అంటనట్టుగా ఒక సమాధానం రాశాడు. ఆ ప్రత్యుత్తరంలో బాలచంద్రికను తిరిగి ప్రతిష్ఠాన నగరానికి పంపించే ప్రస్తావనే ఎత్తలేదు.

ఆ పైన ఇందు శర్మ మరింత భీష్మించుకుని కూర్చున్నాడు.

అలాగలాగ క్రమంగా ఆరు మాసాలు గడిచిపోయాయి. అయినా ఇందు శర్మ భార్యను పంపించవలసిందని కోరలేదు. అతని నిర్లక్ష్య ధోరణి చూచి మహేంద్ర పులమావి విజ్ఞకతో ఆ విషయం ప్రస్తావించాడు. విజ్ఞక బాలచంద్రికను త్వరలో నే ప్రతిష్ఠాన నగరానికి తోడుకుపోగలననీ, ఆ విషయంలో అంతగా భయపడవలసిందేమీ లేదనీ, తా నన్నీ సర్దుబాటు చెయ్యగలననీ భరవసా ఇచ్చింది. బాలచంద్రిక తల్లిదండ్రు లిద్దరికీ ఆమె అంత ధైర్యంగా భరవసా ఇవ్వడానికిగల కారణం తెలియలేదు. అయినా ఆమె ఆ వ్యవహారం తమకన్నా ఎక్కువ చాకచక్యంతో నే పరిష్కరించగలదనే ధైర్యంతో వారిద్దరూ బాలచంద్రిక నిక బలవంత పెట్టలేదు. అన్నీ విజ్ఞకమీదనే వదిలి పెట్టి అంటీఅంటనట్టుగా మాట్లాడ కూరుకున్నారు. లేకపోతే ఇక మార్గాంతరంమాత్రం ఏమి ఉంది!

ఆరు మాసాలు గడిచినా బాలచంద్రిక మళ్ళీ ధాన్యకటక నగరానికి తిరిగి వచ్చే ధోరణి కనిపించలేదు. వ్యవహారం ఆ విధంగా విషమించగానే ఇందు శర్మ మొట్టమొదట ఎంతో కించపడ్డాడు. కాని మామగారిని

# ★ గృహిణీ ప్రణయం ★

ప్రాధేయపడి ప్రబతిమాలుకోవడం అంటే అతనికి బొత్తిగా నచ్చలేదు.

"ఆడపిల్లలు కన్నవాళ్ళకే అంత బింకమా? వాళ్లకే అంతపట్టుదలైతే నే నెన్ని బిగువులు పోవాలి? పంపించకపోతే నాకేమున్నా లోటా? తలుచుకుంటే నేను తిరిగి వివాహం చేసుకోలేనా? అంతదాకా ఎందుకు? కావలిస్తే కన్నుగీటితే కాళ్ళమీద పడే వారాంగనలు లేరా? ... ఇంతికీ నా వల్ల తప్పేముంది?"

ఇందు శర్మ ఆవేశం అవిఘంగా హెచ్చు పెరిగిపోయింది.

అయినా అతడు తొందరపడలేదు. అలాగే ఇంకా ఆరుమాసాలదాకా ఓపికపట్టి చూచాడు. ఎంతకాలం గడిచినా మహేంద్రపురమావి బాలచంద్రికను తిరిగి ప్రతిష్ఠానానికి పంపించే సూచనలైనా కనిపించలేదు. బాలచంద్రిక పుట్టింటికి వెళ్ళి అప్పుడే ఏడాది అయింది. ఇందుశర్మ అంతవరకు తొందరపడలేదు. ఎప్పుడైనా బాలచంద్రికను పంపించక పోతారా అని ఎదురు తెన్నులు చూచాడు. అతడలాగ ఎదురు తెన్నులు చూడడానికి ఒక చిన్న కారణం ఉంది.

ఇందు శర్మపై పైకెంతగా బిగువులు పోయినా లోలోపల అతనికి భార్య తిరిగి రావాలనే ఉంది. వివాహమయిన ఏడాదిలోను బాలచంద్రికపై అతని కెంతో అప్యాయత ఏర్పడింది. ఆఏడాదిలోను ఆమె అనేకవిధాలుగా అతని మన్నన లందుకొన్నది. నిజానికామె వెళ్ళిపోయిన తరువాత అతడు చాలాచాలా కించపడ్డాడు. పట్టుదలవల్ల పైపైకి దేమీ కనిపించనీయలేదు. అంతే. మహేంద్రపురమావి తిరిగి ఆమెను పంపిస్తున్నానని అని ఉంటే అతడు కిమ్మనకుండా అంగీకరించేవాడే. కాని అలాంటి దేదీ జరగలేదు.

ఏడాది గడిచినా బాలచంద్రిక తిరిగి రాలేదు. మామగారు మహేంద్రపురమావికే అంత పట్టుదల ఉంటే అతడెందుకు లొంగిపోవాలి?

మహేంద్రపురమా విధాన్యకటకానికి దండనాయకుడు మాత్రమే. ఇందుశర్మ తండ్రి హాలసాతవాహన చక్రవర్తి సన్నిధిని అమాత్యాధికారం కూడా చలాయించాడు. అంతటి మహామాత్యుని ఏకైక పుత్రుడు భార్యను పంపించవలసిందని ప్రాధేయపడతాడా? అంత ప్రాధేయపడవలసిన ఆవశ్యకతమాత్రం ఏం కలిగింది? ఇంటిదగ్గర అతనికి సమస్త సౌకర్యాలు సమకూర్చే దాసదాసీజనం ఉన్నారాయెను. తలుచుకుంటే అతనికింకా ఎలాంటి భోగాలయినా కరతలామలకాలే!

ఎన్ని విధాల మథనపడినా ఇందు శర్మకు బాలచంద్రికను పంపించమని ప్రాధేయపడవలసినంత అగత్యం కనిపించలేదు.



మహిషాసురమర్దని
(కంచి, ఏకామ్రేశ్వరాలయం)
ఫొటో: పి. గురుమూర్తి.

అలాగ అలాగ మరికొన్ని వారాలు గడిచిపోయాయి అయినా నలుగురికీ తెలిస్తే అప్రతిష్ఠ అనే భయంతో ఇందు శర్మ అప్పటివరకు వేశ్యా ప్రసంగంలోకి దిగలేదు. సరిగా ఆ సమయంలో దామోదర భట్టతని పరిస్థితి కనిపెట్టి బాగా అంతరంగిక మిత్రుడుగా మారిపోయాడు.

ప్రతిష్ఠాన నగరంలో శరత్కాలం వెనకపటి హేమంతం ప్రవేశించింది. ఆనాటి కానాడు చలి ఎక్కువైపోయింది.

ఇందు శర్మ ఒకనాటి సాయంకాలం వేళ ప్రాసాదంమీద కూర్చుని ప్రతిష్ఠాన నగర రాజవీధిలో సాగిపోయే బంగారు నీరెండ సొగసులు పరిశీలిస్తున్నాడు. అప్పుడే కొంచెం చిరుచలి ప్రారంభించింది. దూరదూరంగా దేవాగారాలలోను, చైత్యాలలోను భక్తుల స్తోత్రపాఠాల సందడులు వినిపిస్తున్నాయి. మావటీలు కొందరు ఏనుగులను గోదావరీనదికి తీసుపోతున్నారు. మరికొందరు విలాస పురుషులుత్తమాశ్వాలపై స్వారీ చేస్తూ రీవిగా సాగిపోతున్నారు. అప్పుడప్పుడు నీరెండపడిన గుర్రాల కళ్ళాలు బంగారు సంకెవెలుగుల్లో తళతళా మెరిసి పోతున్నాయి. వారి విలాస వైఖరులు చూడగానే ఇందుశర్మ అప్రయత్నంగా ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు.

అంతలో దామోదర భట్టు నెమ్మదిగా వచ్చి అతని పక్కనే కూర్చున్నాడు. ఇద్దరు కొంతసేపటవరకు ఏదో లోకాభిరామాయణంలో పడ్డారు. దామోదర భట్టేదో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చినటడిగాడు:

"అన్నట్టు మీ ఇంటి ఆవిడ ఇంకా రాలేదా?"

ఇందు శర్మ రాలేదన్నట్టుగా తల ఊపాడు

"ఇంక ఎప్పటికి వస్తుంది? ఇన్నాళ్ళదాకా పుట్టింటపడి ఉండడమేమిటి? ఏమైనా అస్వస్థత కలిగిందా?"

ఇందు శర్మ మళ్లీ అలాంటి అస్వస్థత ఏదీ లేదన్నట్టుగా ముభావంగా తల ఊపాడు ఈసారి దామోదరభట్టు సూటిగా అడిగాడు:

"అయితే ఇంతవరకు ఎందుకు రాలేదో?"

ఆ ప్రశ్నతో ఇందుశర్మ అభిమానానికి గట్టి దెబ్బ తగిలింది:

"ఏం రాకపోతేనేం? ఇప్పుడు నాకు వచ్చిన లోటేమిటి?"

"లోటేమీ లేనిమాట నిజమేగాని నీమంచితనం చూచి నిన్ను వాళ్లు మరీ లోకువ చేస్తున్నట్టున్నారు!"

"నేను వాళ్లను ప్రాధేయపడితే గా నన్ను వాళ్లు లోకువచెయ్యడానికి?"

దామోదరభట్టొకనిమిషం మాట్లాడకూరుకున్నాడు. మళ్లీ అందుకున్నాడు:

"ఇన్నాళ్లు పంపకపోతే నీవిలాగ మాటాడ గూగుతున్నావు గాని నేనయితేనా?'
"నీవయితే ఏంజేస్తావు?"
"ఈపాటికి మళ్లీ వివాహంచేసుకుని పది మంది వారకాంతల్ని జాగ్రత్తచేసేవాణ్ణి!"
"నీకేం మహారాజువు!"అన్నాడింగుశర్మ ఒక నిట్టూర్పు విడిచిపెట్టి.

"నీకుమాత్రం వచ్చిన లోటేమిటి? అష్ట మానసు ప్రతిష్ఠ ప్రతిష్ఠ అని పొగలాడు తున్నావు గాని!"

దామోదరభట్టు పైపైకి పదిమంది వార కాంతల్ని జాగ్రత్తచేస్తానని ప్రగ ల్భాలు పలికాడు గాని నిజానికి తనకింట్లో ఆల్లాట పొయ్యిరాజపెంకూడా కష్టమే తరవాత ఇంగుశర్మ కొంచెం మెత్తబడ్డాడు.

'అన్నట్టు నిన్న చంద్రలేఖ నృత్యానికి వెళ్ళలేకపోయానుసుమా!"
'పోనిలే బతికి బట్టకట్టావు?"
"ఏం నిన్నటినృత్యం రక్తికట్టలేదా?"
"నాకదేమీ బాగా లేదుసుమా! నేనక్కడ ఆట్టేకాలం ఉండనేలేదు!"
"తరవాత ఎక్కడికి వెళ్లావు?"
"పట్నంలో కింకొక వారాంగన వచ్చిం దట! ఆమె సందర్శనభాగ్యం దొరుకు తుందేమోనని పడిగాపులుపడి కూర్చు న్నాను."
'దొరికిందా?"
"లేదు"
"ఎందుచేత?"
నాలాంటివాడికి ఆ అంగనామణి దర్శన భాగ్యం దొరుకుతుందటయ్యా!"
"ఏం ఆమె అంతటి అందాలకుప్పా?"
"మన చంద్రరేఖ ఆమె కాలిగోటికికూడా సరిపోదు!"
"ప్రగల్భాలు చెప్పడంలో నీఅంతటి వాడు లేడు!"

"నీచేతే ఆమె చంద్రరేఖకన్నా అంద గత్తెఅని ఒప్పిస్తాను! పందెం వేస్తావా?"
"పందెం ఎందుకుగాని నాకొకమా రామెను చూపిస్తావా?"
"ఆమెదర్శనం అంతతేలికగా దొరకదు. ఎప్పుడైనా సకృత్తుగా ప్రాసాదంమీదికివస్తే చూడవలసిందే!"
"ఎందుచేతో?"
"ఇష్టంలేకపోతే ఆమె ఎవర్నీ చూడదట!"
"ఓహో! అలాగా" పోనీ ఆ దర్శనమైనా ఎప్పుడు దొరుకుతుందో?"
"ఇప్పుడామె మేడమీదికి వచ్చే సమ యమే!"
"అయితే బయలుదేరుదాంపద! అన్నట్టు ఆమె నామధేయం?"
"వారుణి అందానికి తగినపేరు!"
వెంటనే ఇందుశర్మ ప్రయాణసన్నా హంలో పడ్డాడు వెతికివెతికి దక్కని సరి గంచు ఉత్తరీయం వలెవాటుగా వేసు కున్నాడు

"అసలే! ఐశ్వర్యవంతుడవు! ఆపైన అందగాడివి! ఏదో నాలాంటివాడికి గాని నీకెందుకయ్యా ఈ భేషజాలన్నీని!"
ఆపైన ఇద్దరూ బయలుదేరి ఆ రాజవీథిలో ప్రవేశించారు.

## ౬

అదృష్టవశాత్తు ఆవేళ సాయంత్రం వారిద్ద రికీ వారుణి దర్శనం లభించింది. ఇందుశర్మ ఆ తరువాత నాలుగైదుమారు లామె దర్శన భాగ్యం సంపాదించుకొన్నాడు. తరవాత దామోదరభట్టు వచ్చినా రాకపోయినా సాయంకాలం అయ్యేసరికతనికి వారుణీ సందర్శనం ఒక పరిపాటిగా తయారయింది.
ఒకనాడు తెలవారుతూనే దామోదర భట్టు ఇంగుశర్మభవంతికి వచ్చేశాడు. ఒక్క వేడినిట్టూర్పు విడిచిపెట్టాడు
"ఏమీలాభం లేదయ్యా!"
"ఎందుచేత?" అన్నాడు ఇందుశర్మ ఎంతో ఆత్రంగా.
"వారుణితల్లి శ్రీవిరాజిత ధాన్యక టకంలో కోటికి పడగెత్తిన ఐశ్వర్యవంతుడ ట! వారుణి ధనప్రలోభానికి లొంగి పోయే సామాన్య వారకాంత కాదట!"
"చాలే నీ ప్రగల్భాలు! ధనంమీద మమ కారం లేకపోతే ధాన్యకటకం విడిచిపెట్టి ఇక్కడికెందుకు వచ్చింది?"
"శ్రీవిరాజిత చివరికాలంలో గోదావ తీరంలో ఉండాలని ముచ్చటపడిం దయ్యా!"
"అప్పటినించీ ఇక్కడే కొంగజపంతో కాలక్షేపం చేస్తూందిన్నమాట!"

# ★ గృహిణీ ప్రణయం ★

అని ఇందుశర్మ వెటకారంగా ఒక్క నవ్వునవ్వాడు. దామోదరభట్టు రుస రుస లాడాడు:

"నేను చెప్పినవన్నీ వట్టి ప్రగల్భాలని కొట్టిపారేస్తావు. మొట మొదట ఆమె అంతటి అందగత్తె అంటే నా మాట కొట్టి పారేశావు తీరా నీకళ్లతో చూచిన తరువాత నిజమేనని ఒప్పుకున్నావు మాటమీద గౌరవం లేనివాళ్లతో ఏమి చెప్పినా లాభం లేదు."

ఇందు శర్మ మళ్లీ ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు:

"ధనం అక్కరలేకపోతే వేశ్య కావడం ఎందుకు? సలక్షణంగా ఎవరినైనా వివాహం ఆడకూడదూ?"

"అంత వివాహం ఆడవలసిన కర్మ ఏమి వచ్చింది? కంటికి నదరుగా ఉన్నవారి నెవరినైనా చేరదీస్తుంది. అతగాడేమన్నా అధికారం చలాయించబోతే అర్ధచంద్ర ప్రయోగం చేసి వీధిలోకి నెట్టివేస్తుంది!"

ఇందుశర్మ మళ్లీ ఇంకొక నిట్టూర్పు విడిచాడు.

"ఇన్నాళ్లనించీ ఎవరినైనా చేరదీసిందా?"

"ఏమో నాకేం తెలుస్తుంది. నే నెరిగి నంతవరకు, ఇన్నాళ్లనించీ ఎవర్నీ చేరదీయ లేదట!"

"ఎందుచేతనో!"

"ఎందుచే తేమిటి? ఆమెకు కావలసిన వాడు ముందుగా అందగాడై ఉండాలి. ఆ పైన ఐశ్వర్యవంతుడై ఉండాలి. ఆపైన వల్లకీ వాద్యంలో ఆమెను మెప్పించేవాడై ఉండాలి. ఇవన్నీ ఉన్నా ఆమె కళ్ళకు నచ్చాలి. ఏవం విధ శుభ లక్షణ సంయుక్తుడైనటువంటి వరుడు ఆమె కింతవరకు తటస్థపడలేదేమో!"

"చాలా చిత్రంగా ఉందే ఇదంతా?" అన్నాడిందుశర్మ.

"మరి ఏమిటనుకున్నావు వారుణి అంటే!" అని కవ్వించాడు దామోదరభట్టు.

ఈలోగా ఇందు శర్మ కొక చిన్న ఆలోచన తట్టింది:

"ఆమె కోరిన శుభలక్షణాలన్నీ నాకు సరిగ్గా సరిపోయాయే!"

అని పకపక నవ్వాడిందు శర్మ. దామోదరభట్టు నిలదీసి అడిగాడు:

"నీదగ్గర అందము, ఐశ్వర్యము ఉన్నాయి గాని వీణవాయించి వారుణిని మెప్పించ గలవా?"

"నాలుగురోజులు పట్టుబట్టి సాధకం చేశానంటే ఎలాంటి వారిచేతనైనా మెప్పు పొందగలను"

అది విని దామోదరభట్టొక్కమారుగా విరగబడి నవ్వాడు: "ఇన్నేళ్ళు వచ్చి ఇప్పుడు వీణ సాధకమా?"

అని ఇందు శర్మ కేసి చూసి ఎంతో ఆప్యాయంగా చెబుతున్నట్టుగా ముఖం పెట్టి చిన్న సదుపదేశం చేశాడు.

"ఇంట్లో రంభలాంటి భార్య ఉండగా అనవసరంగా ఎందుకయ్యా నీకీ శృంగార చేష్టలు! నామాట విని మామగారిని ప్రాధేయపడి బాలచంద్రిక నిక్కడికి పిలిపించుకో! చెప్పినమాట విను!"

ఆ మాటతో ఇందుశర్మకు బాకుతో పొడిచినట్లయింది. దామోదరభట్టు తాను వేసిన సమిధ పనిచేసిందని లోలోపల సంతోషించాడు:

"ఇంతబతుకు బతికి భార్యను పంపించమని మామగారిని ప్రాధేయపడతాననుకున్నావా? చూడు వారంరోజులలో 'వారుణీ విజేత' అన్న బిరుదు సంపాదించితీరతాను"

"నీకంటె కొమ్ములు తిరిగిన వాళ్లు వెళ్ళినా చివరికామె దాసిదర్శనంకూడా కాలేదు! ఇదీ నీవల్ల జరిగేపని కాదు. నామాట విను! కాస్సేపు కళ్లుమూసుకొని మామగారిని ప్రాధేయపడు! లేకపోతే నీవే ఒకసారి ధాన్యకటకంవెళ్ళి బాలచంద్రికను చూచి రారాదూ?"

"అంతటి చిన్న చూపు చూచినతరవాత మళ్ళీ మామగారి గుమ్మం తొక్కుతా ననుకున్నావా?"

అని మండిపడ్డాడిందు శర్మ

దామోదరభట్టు మళ్ళీ నవ్వాడు. "సరే గాని ఈలోగా కాస్త వీణమీద త్రిస్థాయి సాధకం మొదలుపెట్టు. కొంత చెయ్యి తిరుగుతుంది. ఆపైన వెడుదువుగాని వారుణీ విజయానికి!"

అని నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయాడు. తరవాత వారం పదిరోజులదాకా ఇందుశర్మ రాత్రింబగళ్లదేపనిగా వీణ సాధకం చేశాడు.

ఒకనాడు చక్కగా వేషం సరిదిద్దుకొని వారుణీ దర్శనానికి బయలుదేరి వెళ్ళాడు. అంతకుముందే ఒక పరిచారిక ద్వారా తన గుణగణాలన్నీ ఆమెకు తెలియజేయించాడు.

వారుణి మేడమీదినించే అతని రాక గమనించింది. ఇందుశర్మ లోపలికి వెళ్లగానే ఆ భవంతి భాగ్య భోగ్యాలు కళ్ళకు మిరుమిట్లు కలిగించాయి. అంతలో ఒక పరిచారిక అక్కడికి వచ్చింది. అంతేగాని వారుణి అక్కడికి రానేలేదు.

ఆ పరిచారిక అతనినెంతో ఆప్యాయంగా గౌరవించింది.

"మిమ్మల్ని గురించి మా అమ్మగారింతకు పూర్వమే కొంచెం విని ఉన్నారట! అయితే ప్రస్తుతం తీరిక లేకపోవడంవల్ల మన్నించవలసిందని చెప్పమన్నారు. వీలయితే రేపుసాయంత్రం ఒక్కమారిక్కడికి విజయం చెయ్యమన్నారు!"

అని ఎంతో మర్యాదగా ఒక కర్పూర తాంబూలం అతని చేతికందించింది.

మొదట పరిచారికను చూడగానే ఇందుశర్మకు గుండెల్లో రాయిపడింది "చివరికి దర్శనమైనా దొరకదు కాబోలు!" అని ఎంతో మథనపడ్డాడు.

కాని పరిచారిక రేపు విజయం చెయ్యవలసిందని చెప్పగానే అతని పంచప్రాణాలు వెంటనే లేచివచ్చాయి ఆ మరునాడయినా దర్శనం దొరికి తీరుతుందని అతనికి కొంచెం ధైర్యం కలిగింది.

ఇందుశర్మ నెమ్మదిగా భవంతికి తిరిగి పోతూ "భయం లేదు వారుణి నా వలలో పడి తీరుతుంది"

అని తనకు తానే భరవసా చెప్పుకున్నాడు.

ఆరాత్రి ఎంత సేపటికీ అతనికి నిద్రపట్టలేదు. రాత్రి తెల్లవారులూ వీణ సాధనతోటే కాలక్షేపం చేశాడు

ఎప్పుడు సాయంత్రం అవుతుందో? ఎప్పుడు వారుణీ దర్శనం చేస్తానో! అని ప్రతిక్షణము వేచి, వేసారిన ఇందుశర్మ కెంత సేపటికీ సుర్యాస్తమయం కానట్టే కనిపించింది.

కొంత సేపటికి సూర్యాస్తమయం కూడా అయింది ఇందుశర్మ చక్కగా వేషం వేసుకుని వారుణీ భవనానికి వెళ్ళిపోయాడు

—సశేషం

# బొమ్మల కొలువు ★ శ్రీనివాసకాశ్యప

అమ్మా! నాకూ బొమ్మలు
తెమ్మనవే ఓ అమ్మా!
బొమ్మలపండక్కి నేను
బొమ్మకొలువు పెడతానే!

॥అమ్మా!॥

సుందరి, ఇందిర అందరు
అందమైన బొమ్మ లెన్నొ
కొన్నారే! నాన్నను మరి
కొనమనవే ఓ అమ్మా!

॥అమ్మా!॥

మొగమున ముంగురులాడే
ముసిముసి నగవుల పాపలు!
తల్లుల చెంగులు బట్టుకు
తరలుచున్న దొక్క జట్టు!

॥అమ్మా!॥

పక్కయింటి పంకజమూ
చక్కని వెన్నో బొమ్మలు
కొలువులోన పెట్టిందే!...
కొనమనవే ఓ అమ్మా!

॥అమ్మా!॥

ముద్దులొలుకు శ్రీకృష్ణుడు
వద్దజేరి గోపెమ్మను—
పాలు పెరుగు కొనిపోవగ
పట్టి లాగు బొమ్మ ఒకటి!

॥అమ్మా!॥

ఒక చేతిలొ పుస్తకాలు,
ఒక చేతను జపమాలా,
ధరియించెను వీణ నొక్క
కరమున, ఆ బొమ్మ కొనవె!

॥అమ్మా!॥

నిన్నటి సాయంత్రమ్మున
నాన్నను నే నడిగితేను
పొమ్మని కోపమ్ముతోడ
అమ్మా! నువు చెప్పవటే?!

॥అమ్మా!॥

బొమ్మలపండుగరోజున
బొమ్మలకొలువును పెట్టి
చెల్లాయీ, నేను పోయి
చెప్పెదమే పేరంటము!

॥అమ్మా!॥





రంగులరంగుల బొమ్మలూ!
రమ్యములైనా బొమ్మలు!

ఫొటో: ఎస్. రామకృష్ణ



దశావతారాలు —ఫొటో: నిప్పాణి జమున.

## బాలకుల దీవెనలు బ్రహ్మ దీవెనలు!

# అయ్యవారికి చాలు ఐదు వరహాలు!

పరగ నాశ్వీజ శుక్ల
పక్షంబునందు
తెర గొప్ప దీవించ
వస్తి మిట మేము
శ్రీరస్తు విజయోస్తు
దీర్ఘాయురస్తు
భూరి వైభవ మస్తు
పుత్రలాభోస్తు
ధీరస్తు విజయోస్తు
దీర్ఘాయురస్తు
ధన కనక వస్తు వా
హన సిద్ధిరస్తు
కారుణ్యముగ మీకు
కల్యాణమస్తు

* * *

ఆశ్వీజ శుద్ధ మహా
ర్నవమి గొప్ప
బాగుగా దీవించ
వస్తి మిట మేము.
బాలకుల దీవెనలు
బ్రహ్మ దీవెనలు
చాల సంతోషులై
సరసు లయ్యెదరు
శ్రీమంతులై మహా
శ్రేయములు గల్గి

భూమిలో వెల లేని
భోగములు గల్గి
బహుకీర్తి ...
... గల్గి
కొడుకులును కోడండ్రు
కొమరొప్ప గల్గి
సతులతో సుతులతో
సౌఖ్యములు గల్గి
... లును పెండ్లింట్లు
వరుసతో గల్గి
... బహు
వైభవంబుగను.

* * *

అయ్యవా రొచ్చెనని
అనుమానపడక
నయమైన మాటలని
... పొమ్మనక
... 
... పొమ్మనక
ఈసారి పొమ్మనక
తిరిగి రమ్మనక
వరుసతో మీవంటి
వారెందరనక

శీఘ్రముగ పంపుడీ
శ్రీమంతులార.

* * *

అల్లుండ్ల వలె గాదు
అలిగి మిమ్మడుగ
చెల్లెండ్ర వలె గాదు
చెలగి మిమ్మడుగ
... జీతము గాదు
... మిమ్మడుగ
... గావు
పలుమారు అడుగ
కొత్తప్పలును గావు
... మిమ్మడుగ!
అయ్యవారికి చాలు
అయిదు వరహాలు
పిల్లవాండ్లకు చాలు
పప్పు బెల్లాలు

* * *

శ్రీరస్తు మీకెల్ల
దిగ్విజయ మస్తు
ఆయురభివృద్ధితో
నైశ్వర్యమస్తు
జయాభిజయీభవ!
దిగ్విజయీ భవ!





# శమీ శమ

త్రైలుగు వారికి దసరా చాలా పెద్ద పండుగ. పండుగరోజుల్లో విద్యార్థులందరికీ దసరా సెలవు లిస్తారు. బంధుమిత్రులందరు పండుగలలో ఒకచోట కలుసుకుంటారు. ఇళ్ళు వాకిళ్లు పచ్చ పచ్చని తోరణాలతోను, చిత్ర చిత్రమైన ముగ్గులతోను కలకలలాడుతూంటాయి.

## దేవీ నవరాత్రాలు

మన దేశంలో చాలా మంది ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలుకొని నవమి వరకు దేవీ నవరాత్రాలు జరిపి దేవీపూజ చేసుకుంటారు.

తొమ్మిది రోజులు దేవీపూజ చెయ్యలేనివారు అష్టమినాడు, నవమినాడు, దశమినాడు దేవీపూజ చేస్తారు.

నవమికే మహానవమి అని ఇంకో పేరుంది. ఆనాడు ఆయుధపూజ చెయ్యాలని మన సంప్రదాయవేత్తలు చెబుతారు.

పూర్వకాలంలో రాజులు దేవీ పూజ చాను ఆయుధపూజ చేసుకొని ఆ మరునాడు దిగ్విజయయాత్రకు బయలుదేరేవారు. కనకనే ఆ రోజు విజయదశమి అయింది.

ఈ రోజుల్లో ఆయా వృత్తులవలంబించేవారంతా తమ తమ పనిముట్లే ఆయుధాలుగా భావించి పూజ చేస్తున్నారు.

రైతులు తమ నాగళ్లకు పూజలు చేసుకుంటారు. ఇలాగే ఆయా వస్తువులకు పూజ చెయ్యడం ఇప్పటికీ ఆచారంలో ఉంది. ముఖ్యంగా విద్యార్థులందరు ఆనాడు పుస్తకపూజ చేసుకుంటారు.

## శక్తిపూజ

దసరా పండుగలలో సరస్వతీ పూజతోపాటు మహాలక్ష్మి, మహాకాళీ పూజలు కూడా జరుగుతాయి.

సరస్వతీదేవినే త్రివిధశక్తి స్వరూపిణిగా ధ్యానించి, షోడశోపచారాలతోను పూజ చేస్తారు.

మన దేశంలో శక్తిపూజ చాలా ప్రాచీనకాలంనించీ జరుగుతూంది. ఋగ్వేదంలో దేవీసూక్తం బహు పురాతనమైనది. అందుచేత ఆనాటినించీ ఈ సంప్రదాయానికంకురార్పణ జరిగిందని చెప్పవచ్చును.

## శమీపూజ

ఈనాడు ప్రతి గ్రామంలోను శమీవృక్ష పూజకూడా జరుగుతుంది. ఈపూజ ఎందుకు ప్రారంభమైనదో స్పష్టంగా తెలియడం లేదు.

శమీ పూజ స మయంలో ఈ క్రింది మంత్రం చదువుతారు.



దుర్గాభవా

"శమీ శమయ
శమీ లోహి
ధారి ణ్యర్జున
రామస్య ప్రరు
ఈ శ్లోకం అర్థం
"శమీవృక్షం
శమీ శత్రు వినాశిని
బాణాలు ధరించి
జయం కలిగిం ది.

## దసరా పండ





# ...యుతే పాపం



...ని (కటక్)

పాపం
...గా,
...ం
...న్"
ఇది:
పాపంశమింపజేస్తుంది.
, శమీవృక్షం అర్జునుని
... శ్రీరామునికి శత్రు
...

శ్రీరాముడు రావణాసుర సంహారానికి పూర్వం శమీవృక్షపూజ చేశాడు. కనకనే శమీవృక్షానికి శ్రీరామునికి జయం కలిగించిందనే గౌరవం దక్కింది.

శత్రు విజయానికి పూర్వం జరిగిన శ్రీరాముని శమీ పూజతో మన శమీపూజ ప్రారంభమైనదని చెప్పవచ్చును

## భారత గాథ

పాండవులు అజ్ఞాత వాసానికి పూర్వం తమ ఆయుధాలన్నీ ఒక జమ్మిచెట్టు మీద దాచుకొన్నారు.

అజ్ఞాతవాసం పూర్తి అయిన తరువాత అర్జునుడు శమీవృక్షానికి పూజచేసి తిరిగి ఆయుధాలు ధరించి యుద్ధానికి బయలుదేరాడు. కౌరవులు విరటుని గోశాలలో ప్రవేశించి ఆయన గోవులన్నిటినీ తీసుకుపోయారు. అర్జునుడు కౌరవులనందరినీ వెంటదరిమి విరటుని గోవులు విడిపించుకు వచ్చాడు.

అప్పటినించీ రాజులందరికీ ఆయుధపూజతో బాటు శమీపూజ చెయ్యడంకూడా ఒక పరిపాటి అయింది.

ప్రాచీనకాలంలో ఆయుధపూజ, శమీపూజ క్షాత్రధర్మం అవలంబించేవారే చేసేవారు కాని ఈ నాడీ పూజ అందరికీ సర్వసాధారణం అయింది. అయితే మన తెలుగు భారతం చదివితే శమీపూజ విషయంలో ఒక సందేహం కలుగుతుంది. మన భారతం ప్రకారం ఆశ్వయుజబహుళ అష్టమినాడు, నవమినాడు ఉత్తర గోగ్రహణం జరిగినట్టు తెలుస్తూంది.

"బహుళాష్టమి నీతడు స
న్నాహనముతో పసుల బట్టె
నవమిని మన గో
గ్రహణ మని నిశ్చయించిన
నహి కేతను పలుకులకు
మహాహ్లాదమునన్"

ఇందుచేత భారతంలోని శమీకథకు సంప్రదాయికంగా వచ్చే శమీపూజకు సంబంధం లేదని తేలిపోతుంది.

ఇక మిగిలినది శ్రీరాముని శమీపూజ బహుశః ఈ సంప్రదాయాన్నిబట్టే శమీపూజ బాగా ప్రచారంలోకి వచ్చిఉండవచ్చును.

## దసరా గిలకలు

ఈ రోజులలో పిల్లలు దసరాగిలకలు (దీన్నే గడెలుపట్టడమని కూడా అంటారు) పట్టుకుని ఇంటింటికీ ఊరేగుతారు.

"పిల్లవాళ్లకు చాలు
పప్పు బెల్లాలు
అయ్యవారికి చాలు
అయిదు వరహాలు."

అని ఎంతో హాయిగా పాడుతూంటారు. రంగురంగుల గిలకలతో ఊరేగే బడిపిల్లలను చూస్తూంటే, మనకు పూర్వకాలంలో రాజులు దిగ్విజయ యాత్రలు జ్ఞాపకం వస్తాయి. గిలకలుపట్టే ఆచారం పూర్వుల దిగ్విజయ యాత్ర కనుకరణమే.

## విజయకాలం

విజయదశమినాడు నక్షత్రోదయమైన సాయంకాలవేళ చాలా శుభకరమైంది.

# ...ంగ ప్రాధాన్యం



# మహిషాసుర మర్దని



తాండవ చండిక (కటక్)
—ఫొటో: క్రముద్దీన్ ఖాన్.

మహిషాసుర మర్దని స్వరూపం తెలుసు కుంటే ఎవరికయినా ఒళ్లు జలద రిస్తుంది. మహాలక్ష్మి మహిషాసుర మర్దనం చేసినదని దేవీసప్తశతి పేర్కొంటున్నది. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి మూడు శక్తిస్వరూపాలే.

మహిషాసుర మర్దని అంటే మహాలక్ష్మి మహిషుడనే రాక్షసుణ్ణి సంహరించినదని సాంప్రదాయికులు లోక అర్థం చెబుతారు. స్థూలంగా ఈ వ్యాఖ్యానం సరియైనదే.

అయితే దీనిలో ఇంకొక అంతరార్థం కూడా ఉంది.

మహిషాసురుడంటే దుష్టశక్తులకు, మాంద్యానికి ఒక రూపకల్పన. మహాలక్ష్మి మహిషాసురుణ్ణి సంహరించివేసిందంటే ప్రపంచంలో దుష్టశక్తులన్నిటినీ సంహరించివేసిందన్నమాట.

ప్రపంచంలో దుష్టశక్తులకు, శిష్టశక్తులకు నిత్యము సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. శిష్టశక్తులు మూర్తీభవించిన వారే దేవతలు. దుష్టశక్తులు మూర్తీభవించినవారే రాక్షసులు. దేవాసురయుద్ధం అంటే కేవలం ఆయా వ్యక్తులమధ్య జరిగే యుద్ధమని అర్థం కాదు. దుష్ట శిష్ట శక్తులమధ్యన జరిగే నిత్య సంఘర్షణమే దాని పరమార్థం.

మనవారు దేవీనవరాత్రులలో దేవిని సర్వ దేవతా స్వరూపిణిగా మహాశక్తి మూర్తిగా ఆరాధిస్తున్నారు.

ఆ మహాశక్తే మహిషాసురమర్దని. ఇదే దేవీపూజా పరమార్థం. ★

## ★ శమీ శమయతే పాపం ★

ఈ సమయంలో ప్రారంభించిన కార్యాలన్నీ నిర్విఘ్నంగా నెరవేరతాయి. ఈ క్రింది శ్లోకం ఈ విషయమే చెబుతూంది:

"ఆశ్వీజస్య సితే పక్షే
దశమ్యాం తారకోదయే
సకాలో విజయో నామ
సర్వకామార్థ సాధకః"

### "అపరాజిత"

అతి ప్రాచీనకాలంలో అపరాజితా దేవి పూజ జరిగేది. 'అపరాజిత' అంటే 'పరాజయములేని దేవత' అని అర్థం. ఆశ్వయుజ శుద్ధ నవమి దశమి తిథులలో అపరాజితా దేవిని పూజించినవారికి దిగ్విజయం కలుగుతుందనీ ఈ దేవత అవశ్యము ఆరాధింపదగిన దేవత అనీ స్కాందం పేర్కొంటున్నది.

చాణక్యుని అర్థశాస్త్రంలో కూడా ఈ దేవతాపూజ ప్రశంస కనబడుతూంది. దీనిని బట్టిచూస్తే జైత్రయాత్రకు బయలుదేరే రాజులందరు ఈ దేవతకు పూజలు చేసేవారన్నమాట!

ఈ దేవతాపూజే క్రమక్రమంగా నేటి కాలపు శక్తిపూజగా పరిణామం చెంది ఉండవచ్చును.

ఇంకొక విషయం 'అపరాజితా' అనే పదానికి శమీవృక్షమనే అర్థంకూడా ఉంది. శబ్దకల్పద్రుమ నిఘంటువు ఈ అర్థం పేర్కొంటున్నది. అందుచేత ఈ శబ్దార్థాన్ని బట్టి క్రమక్రమంగా శమీ పూజా సంప్రదాయం ఏర్పడి ఉండవచ్చును.

ఏది ఏమైనా ఈనాటికిది హైందవులందరికీ అతిముఖ్యమైన పండుగ. ఈనాడు శక్తిపూజకొక ప్రత్యేక ప్రాధాన్యం ఏర్పడింది.

శక్తికటాక్షం లేనిదే శివుడు తన చిటికెన వేలైనా కదపలేడని మన సంప్రదాయం చెప్తూంది. శంకరునివంటి వానికే శక్తి కటాక్షం లేనిదే పని జరగనప్పుడిక సామాన్యుల మాట వేరే చెప్పనక్కరలేదు గదా!

ఈ ఏడాది దసరా ఉత్సవాలలో ఇంకొక విశేషం ఉంది. ఆంధ్రులు అచిర కాలంలో ఆంధ్రప్రదేశ విజయోత్సవం జరుపుకుంటున్నారు.

ఆంధ్రజాతి శక్తిపూజ చేసుకొని వినూతన శక్తిసామర్థ్యాలతో ఆంధ్రప్రదేశావతరణ మహోత్సవానికి సన్నద్ధం కాగలదని ఆశిస్తున్నాము. ★



మహిషాసుర మర్దని (మహాబలిపురం)



కేల పిల్లనగ్రోవి లీల కీలించెనే!
బాలకృష్ణుని ఠీవి మేను మరపించెనే!

## విజయదశమి అంటే

విజయం కలిగించేది కనక విజయదశమి. ఆ దశమినాడు ప్రారంభించిన కార్యాలన్నీ నిర్విఘ్నంగా నెరవేరుతాయి. అందుకే విజయ దశమి అనే పేరు వచ్చింది.

పోతే ఆనాడు సాయంసమయాన గ్రామంలోని పిల్లలూ, పెద్దలూ అంతా గ్రామ మధ్యంలో నాటిన శమీవృక్షానికి పూజచేస్తారు. శమీ పూజ పాప వినాశకమనీ, విజయ దాయకమనీ విశ్వసిస్తారు. ఆ శమీవృక్షం విజయద శమీ వృక్షం. అంటే విజయము నిచ్చునట్టి శమీ వృక్షము. అందుచేత విజయదశమీ పర్వం సార్థక నామధేయం కలిగిన పర్వం.

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

(12 వ పేజీ తరువాయి)

## మంత్రాల మంత్రి

మంత్రశక్తితో ప్రకృతిశక్తుల్ని వశపరుచుకోవచ్చునని నమ్మకం మన దేశంలోనే కాదు, ప్రతి దేశంలోనూ నాడూ నేడూ కూడా ఉంది. కాని పూర్వకాలంలో ఉన్నంతగా ఈ కాలంలో లేదు; మన దేశంలో ఉన్నంతగా ఇతర దేశాలలో లేదు. సైన్సు అభివృద్ధి అయిన దేశాల్లో ఈ నమ్మకం క్రమంగా తగ్గిపోతూంది. సైన్సు బాగా అభివృద్ధికాని దేశాల్లో ఇప్పటికీ నిలిచిఉంది.

మంత్రాలతో రామాయణ భారతాల కాలలలో శాపాలివ్వడం, దేముడిదగ్గిరికి వెళ్లడం, బతికున్నవాళ్లని చంపివేయడం, చచ్చినవాళ్లని బతికించడం ఇలాంటివి చాలా చేసేవారు. ఇప్పుడవన్నీ ఏమైపోయాయో తెలియదు. పాముకాటు, తేలుకాటు నయంచేయడం, చేతబడులు చేయడం, దయ్యాల్ని వదిలించడంలాంటివి కొద్దిగా మిగిలి ఉన్నాయి. కాలక్రమేణా ఇవికూడా ఇతర మంత్రశక్తుల లాగానే మాయమైపోతాయేమో తెలియదు

నాకు చిన్నప్పుడొకసారి తేలు కుట్టింది. బాధ భరించలేక మావాళ్లు మాఊళ్ళో ఉన్న తేలుమంత్రగాణ్ణి పిలిపించారు. ఆయన మంత్రంవేస్తే ఎలాంటి విషమైనా దిగిపోతుందని ప్రతీతి. వేపాకు వగైరా సరంజామాతో ఆయన వచ్చి మంత్రం వేశాడు. నాబాధ తగ్గలేదు. ఆయన నిమిష నిమిషానికీ 'తగ్గిందా' అని నన్నడిగేవాడు. నేను 'తగ్గలే'దనేవాణ్ణి. చివరికాయనకి కోపం వచ్చింది. 'తగ్గిందా' అని కోప్పడ్డాడు. నేను 'తగలేదు' అని ఇంకా కోపంగా ఏడ్చాను. ఆయన ఏదో పసరు రాసి వెళ్లిపోయాడు. నేను యథాప్రకారం ఇల్లంతా గగ్గోలుచేసి, ఆ రాత్రంతా నిద్ర పట్టక బాధపడ్డాను. ఆ మర్నాడెప్పుడో తేలుబాధ తగ్గిపోయింది. బహుశా అప్పటికి పనిచేసి ఉంటుంద తేలు మంత్రం!

కాని మంత్రం వెంటనే పనిచేస్తుందని, 'సింపని' బోలెడుగుంది మిత్రులు చెబుతున్నారు. బహుశా నాకుతప్ప అందరికీ పనిచేస్తుందికాబోలని సర్ది చెప్పుకుని ఊరుకోవడంకంటె ఏం చెయ్యగలను?

లోక సంగ్రహార్థం నేనొక సలహా దేశం మీదకి వదిలేద్దామనుకుంటున్నాను. సైన్సు, దానిమూలంగా ప్రజల్లో ఏర్పడే సైంటిఫిక్ దృక్పథం అభివృద్ధిఅయినకొద్దీ మంత్రాల మీద నమ్మకం ఇప్పుడు పోకపోయినా కొంతకాలానికైనా నశించిపోతుందని నాకు చెడ్డభయంగా ఉంది. ఈ భయంతో నాకు రాత్రిళ్లు నిద్రపట్టకుండాపోతుందని కూడా భయం పట్టుకుంది. అందుచేత భారత ప్రభుత్వంవారు వెంటనే మంత్రాల పునరుద్ధరణకుగాను ఒక శాఖ ఏర్పరచాలని నా సలహా. మంత్రాలు బాగావచ్చిన ఒక పెద్దమనిషిని ఆశాఖకు మంత్రిగా వెయ్యాలి. ప్రాచీన మంత్రశాస్త్రాల్ని పరిశోధించి, ఇప్పటి మన అవసరాలకు తగినట్టుగా వాటిని సవరించాల్సిఉంటే సవరించడానికి ఒక పరిశోధనసంస్థను ఏర్పరచాలి. ఇదంతా జరిగి, ఓపదేళ్లలోనో, ఇరవైయేళ్లలోనో మనకృషి సఫలమైతే, అప్పుడు మన భారతదేశం ఎంత అద్భుతంగా తయారవుతుందో ఊహించుకుంటే నాకెంత ఆనందం కలుగుతుందో మీరే ఊహించుకోవాలి.

ఉదాహరణకి: కాశ్మీరు మనదని మనమూ, తమదని పాకిస్థానువాళ్ళు వాదించుకుంటున్నాము. రేపు ఎప్పుడన్నా ఈవిషయం మీద సంప్రదింపులకి పాకిస్థాన్ ప్రతినిధులు ఢిల్లీవస్తారనుకోండి. సమావేశంలో మంత్రాల మంత్రిగారు కూడా ఒకచోటఉండి, మంత్రప్రభావంచేత పాకిస్థాన్ వాళ్లచేత "కాశ్మీర్ మీదే" అనిపిస్తారు. దాంతో అది పరిష్కారమైపోతుంది

ఇప్పుడు పెద్దదేశాలు కొన్ని అణువు బాంబులు తయారు చేసుకుంటున్నాయి. దేశాభివృద్ధికి వ్యయం కావలసిన కోటికోట్ల ధనాన్ని మారణాయుధాలకోసం వ్యయం చేస్తున్నాయి. మనం దమ్మిడీఖర్చు లేకుండా మంత్రాల మంత్రిగారిచేత పూర్వకాలపు ఆగ్నేయాస్త్రంలాంటి అస్త్రాలను ప్రయోగింపజేయవచ్చు. అప్పుడు మనదేశం ఎంత గొప్పదేశమైపోతుందో ఆలోచించండి.

ఇలాగే ప్రాజెక్టులు లేకుండా పంటలు పండించవచ్చు. విద్యుచ్ఛక్తి లేకుండా దీపాలు వెలిగించవచ్చు. మందులు లేకుండా రోగాలు నయంచేయ్యవచ్చు. ఏదికావాలంటే అది చెయ్యవచ్చు.

మంత్రాలతో పాముకాటు తేలువిషం దించేసినప్పుడు, చేతబడులు చేయగలిగినప్పుడు ఇవన్నీ ఎందుకు సాధ్యంకావు? ప్రభుత్వంవారు మంత్రాల విషయం శ్రద్ధగా పరిశీలించి వాటిని పునరుద్ధరించి దేశక్షేమానికి ఉపయోగించడం అవసరం.

—ఎమ్. రామారావు.—గుంటూరు.

### సూక్తులు

"ఊపిరున్నన్నాళ్ళూ,
ఎన్నడూ ఎప్పుడూ
ఉసూరుమనకు."

*  *  *

"నీకో కాస్తంత;
నాకో కూస్తంత ... ఇదే
నేస్తంట"

మా ఊళ్లో మారయ్య అనే మంత్రగాడున్నాడు. పెదపెద్దడాక్టర్లు కుదర్చలేని వాటిని తన మంత్రాలతో అయిదు నిముషాల్లో పోగొట్టేవాడు. ఒకనాడు రామయ్యగారికోడలు విశాలాక్షి తోటలో తిరుగుతూ ఉండగా పాముకరచింది. విశాలాక్షి మొగుడు మాఊరికిపక్కనున్న పట్నంలో పేరుపొందిన డాక్టరు. అతనితోపాటు మారయ్యకు కూడా కబురెళ్ళింది. అతను వచ్చేసరికి విషం శరీరంఅంతటా క్రమ్ముకుంది. విశాలాక్షి మొగుడు చూచి "లాభంలేదు" అని విచారంతో చెప్పేడు. కానియింతలో మారయ్య వచ్చిచూచి తన పంచెలో చిన్నముక్క చింపి మంత్రం ఏదో వేసి మెడలో దండలాగ వేశాడు. కొద్ది సేపటిలో ఆవిడ తేరుకుంది. ఇంత పేరుపొందిన డాక్టరునైయుండి నేనేమీ చేయలేకపోయానుకదా మారయ్య ఎలా బ్రతికించగలిగాడు అని భర్త ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆక్షణంలో మారయ్యేకనక రాకపోయిన యెడల యింతమంది చూస్తూవుండగా విశాలాక్షి ప్రాణంపోయేది.

మా చిన్నతమ్ముడు రామానికి చేతివేలు మీద తేలుకరిచింది. ఇంట్లోఅందరూ గాబరాపడిపోయి వాడిని తీసుకొని డాక్టరుగారిదగ్గరకు వెళ్దామనుకుంటున్నారు. మా పక్కింటి మామ్మగారిని తేలుమంత్రం వేయడానికి తీసుకువచ్చాను. మా అమ్మావాళ్ళందరూ "నీకేం చాదస్తమా? లేకపోతేపిచ్చా! తేలుకరచి వాడేడుస్తుంటే [illegible]ంగుల మామ్మగారి మంత్రాలు ఏమిటి? డాక్టరుగారి దగ్గరకువెళ్ళి ఒకయింజక్షన్ యిప్పించనీ" అని కేకలేశారు. కాని నేను పట్టుపట్టుటవలన మామ్మగారిచేత మంత్రింపచేయించారు. మంత్రం వేసిన కొద్దినిముషాలలోనే మంటపోయిందని [illegible] చెప్పాడు. వాళ్ళకి యింతలోనే ఆమంట ఎలాపోయిందా అని ఆశ్చర్యపోయేరు.

—ఎమ్. విమల.

★

# గడియారం గొల్లుమంది

ఉత్సాహం పన్నెండుగంటలు దాటింది. మేరీ ప్రయాణానికి సిద్ధమయింది. ఆమె, చక్కని దుస్తులుధరించి చూపరులకొ కన్నుల కలిగిస్తున్నది. ఆమె బసచేసిన హోటలు గదిలోని తన కొద్దిపాటి సామాను బండిమీద భద్రపరిచింది. ఆఖరిసారిగా హోటలు యజమానికి కృతజ్ఞత తెలిపి బయల్దేరింది. ఇంతలో హోటలులోని పెద్ద "బట్లరు" కంగారుగా తన యజమాని చెవులో యేదో చెప్పాడు. యజమాని గబగబ మేరిని సమీపించి యేదో అడగాలనుకొని, అడగలేక సంశయించాడు. మేరీ వెంటనే ఏమిటన్నట్లు తల పైకెత్తింది.

యజమాని మెల్లగా "క్షమించాలి మీ గదిలో అమర్చిన టేబులు గడియారం కనబడ లేదండీ" అంటూ తన సంశయాన్ని వెలిబుచ్చాడు.

"గడియారమా! నాకు తెలియదండి." ఏమీ యెరుగనట్లు మేరీ జవాబిచ్చింది.

"అదికాదండి పొద్దుటివరకు అది మీ గదిలో వున్నట్లు మా బట్లరు చెప్తున్నాడు. ఇప్పుడు చూస్తే అది కనుపించలేదట అందుకని మిమ్మల్ని..." అంటూండగానే,

"అయితే అది నేతీశాననా?" మేరీ కొంచెం గంభీరంగా పలికింది.

"మీరు తీశారని నేననను కాని అది అక్కడ పొద్దుటవరకు వుండటమాత్రం నానమ్మకం" అంటూ నసిగాడు యజమాని

"అసలు అది నాగదిలో వున్నట్లుకూడా నే గమనించలేదండి. అయినా నాకు టైము కావలసినప్పుడు నా చేతిగడియారాన్నే చూసుకొనేదాన్ని. నాకు దానివివరాలు యేమీ తెలియవండి. దయవుంచి యింకెవరినైనా అడుక్కోండి. నాకు బండి టైమవుతున్నది" అంటూ తన ప్రయాణానికి తొందరపడసాగింది.

"క్షమించాలి అది పొద్దుటివరకు మీ గదిలో చూచినట్లు మా బట్లరు చెప్తున్నాడు. మీరు గది ఖాళీ చేయటం, గడియారం మాయమవటం ఒకేసారి జరిగినయ్" అంటూ యజమాని నెమ్మదిగా పలికాడు.

"అయితే మీ గడియారాన్ని నేను దొంగిలించాననేగా మీ అనుమానం?" మేరి అడగదలచుకొన్నది సూటిగా అడిగేసింది.

"మాకు ఒకరిమీద అనవసరంగా నింద వేయాలని లేదు, మీ గదిలో వస్తువు పోయింది గనుకనే మిమ్మల్ని అడగవలసి వచ్చింది" యజమాని కొంచెం హోదాతో పలికాడు.

యజమాని మాటలతో, అంతులేని ఆవేశంతో మేరీచండీరూపం దాల్చింది. ఒకసారి తన చేతిగడియారం చూచుకున్నది. ఇంకా తన ప్రయాణానికి, అరగంట వ్యవధి మాత్రమే వున్నది వస్తువుసంగతి తేలేవరకు యజమాని తనని వదలడనుకుంది. అప్పటికే హోటలుముందు జనం గుంపుగా జేరారు

మేరీ యజమానివైపు తిరిగి "ఇదిగో మీరు నన్ననవసరంగా అనుమానిస్తున్నారు నాకవతల చాల అర్జంటుపనులున్నయ్ నేను ప్రయాణం ఆపుకున్నానంటే దానికితగిన నష్టపరిహారం మీరు చెల్లించాల్సి వుంటుంది" అంటూ బెదిరింపుగా పలికింది.

## "చంద్ర"

"ఇదిగో మీపనులతో, ప్రయాణాలతో మాకు సంబంధంలేదు మాకుకావలసింది మా గడియారం సంగతి" యజమాని నిక్కచ్చిగా జవాబిచ్చాడు.

"మీరు యేమైనా చెప్పండి నేనుమాత్రం ప్రయాణం ఆపదలచుకోలేదు తరువాత ఇక మీ యిష్టం" తన నిర్ణయాని కెదురులేనట్లు మేరీ చెప్పేసింది

"గడియారంసంగతి తేలేవరకు మిమ్మల్ని ఒక్క అడుగుకూడ కదలనివ్వను." యజమాని తాను చెప్పవలసింది మొహాన అనేశాడు.

ఈ మాటతో మేరీ మరి రెచ్చిపోయింది. తనని, అంగులో ఆడదాన్ని పట్టుకొని పదిమందిలో నిలవేయటం, పైగా అపవాదంటగట్టటం భరించలేకపోయింది తో కత్రొక్కిన త్రాచులాగ మేనేజరువైపు తిరిగి "అయితే మీరు నేనుదలచింది చేసుకోండి' అంటూ తెగించి బయల్దేరబోయింది

ఇంతలో హోటలు యజమాని పోలీసు ఇన్స్పెక్టరుకు ఫోను చేశాడు. అయిదు నిముషాలలో ఇన్స్పెక్టరు, అనుచరులతో హుటాహుటిగా వచ్చేశాడు. యజమాని జరిగినదంతా పొల్లుపోకుండా చెప్పేశాడు. వెంటనే సోదా చేయమని గూడ విన్నవించాడు.

ఇన్స్పెక్టరు మేరీవైపుతిరిగి "ఏమండీ మిమ్మల్ని మేము సోదాచేయటాని కభ్యంతర మేమైనా..." కొంచెం తగ్గుస్థాయిలో అడిగాడు.

"నిరభ్యంతరంగా చూసుకోండి" మేరీ జవాబిచ్చింది.

"కాని..." అంటూ మేరీ యేదో చెప్పబోయి కొంచెం ఆగింది

"ఊ ...మీ అనుమానమేమిటో చెప్పండి" వెంటనే యిన్స్పెక్టరు అడిగాడు.

"ఏమీ లేదండి. నా కవతల చాలఅర్జంటు పనులున్నయ్ ఇప్పుడు నాప్రయాణం ఆగిందంటే నాకు చాల కష్టం కలుగుతుంది. నాకింకా పావుగంట కంటే యెక్కువ టైము లేదు గడియారం కనుపించకపోతే మీరు నష్టపరిహారం యిప్పించాల్సి ఉంటుంది" ఖచ్చితంగా తన అభిప్రాయం వెలిబుచ్చింది.

ఇన్స్పెక్టరు కొంచెం సందిగ్ధావస్థలో పడ్డాడు. వెంటనే "ఊ; కానివ్వండి. నష్టపరిహారం నే నిచ్చుకుంటాను" యజమాని ధైర్యంగా పలికాడు.

ఇన్స్పెక్టరు, తన అనుచరులతో మేరీ సామానంతా సోదా చేయసాగాడు. ఆమె బండిమీదకు యెక్కించుకున్న సామానంతా ఒక్కొక్కటే దింపి కలయ చూచారు. అక్కడ చేరినజనం, ముందు జరుగబోయే దానికి యెదురు చూడసాగారు. సోదా అంతా ముగిసే సరికి యింకా పన్రెండు గంటలకు, ఐదు నిమిషాలు తక్కువగావుంది.

సోదాలో యేమీ కనుపించక పోయేసరికి యజమాని కొంచెం కంపించసాగాడు. మేరీ ముఖం వికసించింది. ఇన్స్పెక్టరు, అనుచరులతో ప్రక్కకు ఒదిగి నిలబడ్డాడు.

మేరీ తన ప్రయాణాన్ని నష్టపరిహారాన్ని గురించి హెచ్చరించింది. హోటలు యజమానికేమీ పాలుపోవటం లేదు తాను జరిపిందంతా వృధా శ్రమనుకున్నాడు. పైగా నష్టపరిహారం చెల్లించాల్సి వచ్చేసరికి మరీ తికమకలో పడ్డాడు. ఇన్స్పెక్టరు యికతాను ముందేమిచేయాలో తేల్చుకోలేక పోతున్నాడు

ఇంతలో హోటలు కెదురుగా వున్న "టవరుక్లాక్" పన్రెండు కొట్ట నారంభిం

# గడియారం గొల్లుమంది

...చింది. యజమాని గుండెలో గంటలు మోగ సాగినయ్. మేరీ ఒక్కొక్క గంటే మనసులో లెక్కపెట్టుకో సాగింది.

"టవర్ క్లాక్" గంటలు కొట్టటం పని ముగించుకుంది. అంతా నిశ్శబ్దంగా వుంది. ఇంతలో మళ్లీ సన్నని శబ్దంతో గంటలు వినిపించ సాగినయ్. అంతా శబ్దం వచ్చే వైపు పరికించి చూడసాగారు. ఒక్కసారిగా జనమంతా విస్తుపోయారు. తనలోనుంచి గంటలు వినిరావటం చూచి మేరీ సంభ్రమించి పోయింది. హోటలు యజమాని సంతోషంతో యెగిరిగంతేశాడు. సన్నని శబ్దం పన్నెండు గంటలూ కొట్టి ఆగిపోయింది.

వెంటనే యజమాని "ఇదిగో మా గడియారం" అంటూ మేరీని సమీపించాడు.

మేరీ తలవంచుకొని శిలా ప్రతిమలాగ నిల్చుండి పోయింది. ఇక చేసేది లేక మేరీ వణుకుతున్న చేతులతో, తాను ధరించిన బుట్టగౌనులోంచి గడియారం బయటకి తీసింది.

జనమంతా విస్తుపోయారు.

ఇన్‌స్పెక్టరు కలా నిజమా అని ఆశ్చర్యపోయాడు.

యజమాని వెంటనే "చూశారా! ఇన్‌స్పెక్టర్! మా గడియారం యెక్కడున్నా హెచ్చరిక చేస్తూనే ఉంటుంది" ఉత్సాహంగా పలికాడు.

ఇన్‌స్పెక్టరుకిదంతా అయోమయంగా వుంది. మళ్ళీ యజమాని చెప్పటం ప్రారంభించాడు.

"ఇది మామూలు గడియారం కాదు సార్. ఇది ప్రతిగంటకు గంటలు వినిపిస్తుంది. ఇది చాల విలువైందికూడా. అందుకే మాకింత అభిమానం" అంటూ దాని రహస్యాన్ని తెలియచెప్పాడు.

రహస్యం తెలియగానే మేరీ ముఖం నల్లబారింది.

వెంటనే ఇన్‌స్పెక్టరు మేరీని తన కారులో ఎక్కించుకున్నాడు.

గుమిగూడిన జనమంతా గందరగోళంగా మేరీ వైపు చూడసాగారు.

హోటలు యజమాని నష్ట పరిహారం తప్పించినందుకు, కృతజ్ఞతగా గడియారం వైపు ఒక్క చూపు చూశాడు.

గడియారం విజయ గర్వంతో గంట కొట్టి గొల్లున నవ్వింది.

(లారెన్స్ హౌస్‌మన్ కథ ఆధారంగా)

★

బాలసాహితి



# బహుమానం

పూర్వం విష్ణురూపుడు అనే రాజు విశాలమైన కాశీ దేశాన్ని పాలించేవాడు. అతడు ప్రజలను కన్నబిడ్డలవలె చూసికొనేవాడు. అతని రాజ్యంలో ప్రజలందరూ దైవభక్తిగలవారై జీవించేవారు. రాజుకూడ అపారమైన దైవభక్తి, బ్రాహ్మణ భక్తిగలవాడు

ఇలా ఉండగా-ఒకరోజున ఆ ఊరి దేవాలయంలో ఒక బంగారు పళ్లెం దొరికింది. అది చాలా కాంతివంతంగా మెరిసిపోతోంది. పూజారులకు అది అక్కడకు ఎట్లా వచ్చిందో తెలియలేదు అది దొంగవస్తువు అయితే రాజు తమను శిక్షిస్తాను అని వారు భయపడ్డారు. ఇంతలో ఆ పళ్లెంమీద ధగధ మెరుస్తూ కొన్ని అక్షరాలు కనిపించాయి. దానిమీద ఈ వాక్యాలు వ్రాయబడి ఉన్నాయి:- "కాశీ దేశంలో మానవసేవ చేసి జీవించిన వానికి పంపబడిన దైవబహుమానం."

పూజారులు వెంటనే ఈ వార్త రాజుగారికి తెలియచేశారు. రాజు ఈ వింతవార్త విని ఆశ్చర్యపడ్డాడు. తన రాజ్యంలో ఒకరికి అట్టి గొప్ప బహుమానం లభిస్తున్నందులకు ఎంతో ఆనందించాడు. అతడు మంత్రులనూ, పండితులనూ పిలిపించి, వారితో ఆలోచించి, ఈ విధంగా చాటింపు చేయించాడు. "ఈ రాజ్యంలో ఒక గొప్ప బహుమానం లభ్యమయింది. అది మానవసేవ చేసి జీవించిన వానికి పంపబడిన దైవ బహుమానం—ఈ సాయంత్రం మైదానంలో సభ ఏర్పా[illegible] చేయబడింది - కాబట్టి మీలో ఎవరు ఈ బహుమానానికి అర్హులో, ఏవిధంగా అర్హులో, సభవారికి తెలియచేసి, దానిని స్వీకరించవచ్చును."

రాజు చేయించిన చాటింపు వినగానే, ప్రజలలో సంతోషమూ, ఆశ్చర్యమూ కలిగాయి. ఎవరిమట్టుకు వారే తాము ఆ బహు

వసంతరావు వేంకటరామకృష్ణరావు



కలకలలాడే బొమ్మలు!
కొలువులుతీర్చిన బొమ్మలు!

# ★ బహుమానం ★

మానానికి అన్నివిధాలా అర్హుల మని అనుకొని ఆనందించారు. సాయంత్రం అయేసరికి, మైదానం జనంతో క్రిక్కిరిసిపోయింది.

విష్ణురూపుడు ఎత్తయిన బంగారు వేదికమీద కూర్చొని ఉన్నాడు మంత్రి సామంతాది పరివారమంతా అతని చేరువనే ఆసీనులై ఉన్నారు. సభ ప్రారంభమైంది. ప్రజలు అందరూ ముందు ఏమిజరుగుతుందో అని ఆత్రంగా ఉన్నారు.

ఇంతలో ఒక ప్రముఖవైద్యుడు రాజుగారికి వినయంగా నమస్కారం చేసి ఇలా విన్నవించాడు: "ప్రభూ! నేను అనుభవం సంపాదించుకొన్న వైద్యుడిని వైద్యవృత్తిలో నా తల పూర్తిగా నెరిసిపోయింది; జవసత్వాలు అణగిపోయాయి. నేను ఈ వృత్తిలో డబ్బుకొరకు ఆశపడలేదు. ప్రజలకోసం, వారి ఆరోగ్యం కోసం, స్వార్థరహితంగా, డబ్బు పుచ్చుకోకుండా, సేవచేశాను. చాల మందికి ఉచితంగా ఔషధాలిచ్చి సేవచేశాను. నాకు దీనివలన పేరు ప్రతిష్ఠలు వచ్చాయి. కాబట్టి నాకు ఆ బహుమానం పొందే అర్హత ఉన్నదని నా మనవి-చిత్తగించాలి." రాజు మెరుస్తోన్న కళ్లతో వైద్యుడి వంక చూసి ఆ పళ్లెం అతనికి ఇచ్చాడు.

వైద్యుడు పట్టరాని ఆనందంతో దానిని పుచ్చుకొన్నాడు. పాపం! ఆపళ్లెం అతడి చేతిలో కాంతిని గోల్పోయి, ఇత్తడిగా మారిపోయింది. ప్రజలూ, రాజూ, ఈ వింత చూసి ఆశ్చర్యపడ్డారు. వైద్యుడు అవమానంతో ఆ పళ్లెం అక్కడే విడిచి వెళ్ళిపోయాడు. తిరిగి ఆ పళ్లెం బంగారంగా మారిపోయింది. రాజు దైవనిర్ణయం ఎల్లా ఉందో అని ఆందోళనచెందాడు.

ఈలోగా ఒక పెద్ద వర్తకుడు వచ్చి రాజుకి నమస్కరించి సవినయంగా ఇలా విన్నవించాడు: "ప్రభూ! నేను గొప్ప ఆస్తిపరుడ్ని. నా ధనంఅంతా వ్యాపారంలో ఉంది. ఏటా వ్యాపారంమీద వచ్చే వేలాది బంగారు నాణాలు దానధర్మాల క్రింద వెచ్చిస్తున్నాను. వస్తువులమీద వచ్చే లాభం ప్రజలకే పంచిపెట్టి మానవసేవ చేసి జీవిస్తున్నాను. అంతేకాదు - ప్రజలకోసం వైద్యశాలలూ, సత్రములూ కట్టించాను. చెరువులూ, బావులూ త్రవ్వించాను. పండుగలలో దానధర్మాల రూపంలో ప్రజలమీద కనకవర్షం కురిపించాను. కాబట్టి ఆ బహుమానానికి నేను అర్హుడిని - దయచేసి నాకు ప్రసాదించండి." రాజు హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. తన రాజ్యంలో అంతటి దానపరుడు చేస్తోన్న ప్రజాసేవకు రాజు, వర్తకుడిని లోలోన చాలా అభినందించుకొన్నాడు. మెప్పును సూచించే చిరునవ్వుతో, రాజు ఆ బహుమానం వర్తకుడికి ఇచ్చాడు. అతనిచేయి తాకగానే అది ఇత్తడిగా మారిపోయింది. వర్తకుడు చిన్నబుచ్చుకొని, అక్కడనుండి గబగబా నడిచి వెళ్ళిపోయాడు. ఆ పళ్ళెం మళ్లీ బంగారుపళ్ళెంగా మారిపోయింది. అందరూ ఆశ్చర్యపోయారు.

తరువాత ఒక భూస్వామి రాజుగారికి నమస్కరించి భక్తివినయాలతో ఇలా మనవిచేసికొన్నాడు: "ప్రభూ! నేను మీ రాజ్యంలో ఉన్న ఒక భూస్వామిని. నాకు భగవంతుడు ప్రసాదించిన ఆ సంపదను మానవసేవకే వినియోగించి ధన్యుడనయ్యాను. నాకు ఎన్నో ఇళ్ళూ, వాకిళ్లూ, భూములూ తోటలూ ఉన్నాయి. ఇవికాక లెక్కలేనన్ని ధనరాసులున్నాయి. వీటిని అన్నిటినీ ఒక్క ఏడాదిలో ప్రజలకు దానంగా పంచిపెట్టేశాను. నేను కష్టపడి పనిచేసి బ్రతుకుతూ ఉన్నాను. కాబట్టి దయచేసి ఆ బహుమానం నాకు ఇప్పించండి." రాజు సందేహంగా చూస్తూ, దైవ నిర్ణయానికి ఆశ్చర్యపోతూ, ఆ బహుమానం భూస్వామికి ఇచ్చివేశాడు. అతడు దానిని ముట్టుకోగానే ఇత్తడిగా మారిపోయింది. ప్రజల ఆశ్చర్యానికి అంతు లేకపోయింది. భూస్వామి తన దురదృష్టాన్ని నిందించుకొంటూ వెళ్ళిపోగానే, అది బంగారంగా మారిపోయింది.

ప్రజలలో కోలాహలం చెలరేగింది. ఒక ముసలిరైతు వేదిక వద్దకు వెళ్ళదలచి, తిరిగి వెనక్కు మరలిపోయాడు. రాజు అతడిని పిలిపించాడు. ముసలిరైతు భయంతో వణికిపోయాడు. కంఠస్వరం కంపిస్తోంది. ముసలితనంవల్ల ముడుతలు పడిన బడుగు శరీరంతో రాజుగారికి నమస్కారంచేసి ఇలా విన్నవించాడు—"మహాప్రభూ! నన్ను మన్నించండి. నేను నిరుపేదను. భూమిదున్ని దారిద్ర్యంతో జీవయాత్రచేసిన అభాగ్యుడను. నాకు పేదసాదలకు సహాయంచేసే అవకాశాలు లేవు. వారిని చూసినపుడల్లా నాగుండె తరుక్కుపోయేది. కళ్ళ వెంబడి నీళ్ళు కారేవి. వారికోసం నా హృదయం ఆరాటపడేది. ఎంతటి కష్టాలలో ఉన్నా వారికి భగవంతుడి మీద విశ్వాసంతో ఉండమని చెప్పి, ధైర్యం కలిగించేవాడిని. అల్లాంటి నేను ఈ బహుమానానికి ఏ విధంగానూ అర్హుడను కానని అంతరాత్మ చెప్పింది. అందువల్ల వెళ్ళిపోతాను. సెలవు" రాజు మనస్సులో ఒక వింత ఆలోచన మెరిసింది. ఆ ముసలి రైతు చేతిలో ఆ బహుమానం పెట్టేశాడు. ప్రజలు వింతగాచూస్తున్నారు. ఆ బంగారుపళ్ళెం ఎంతో కాంతివంతంగా అతని చేతులలో మెరసిపోతోంది! దైవ నిర్ణయానికి అందరూ ఆశ్చర్యపడ్డారు. సభ ముగిసింది.

మరునాడు, రాజ ప్రాసాదంలో కృష్ణరూపుడు కొలువుతీర్చి, ముసలి రైతుకి ధనకనక వస్తు వాహనాలను ఇచ్చి సత్కరింప బోయాడు. కాని ఆ రైతు వినయపూర్వకంగా ఇట్లా చెప్పకొన్నాడు: "మహారాజా! మీ అభిమానమే నాకు గొప్ప బహుమానం—అది సాటిలేని సన్మానం కూడా. నాకు డబ్బువద్దు. మన్నించండి. సంపదవలన దేవునికి మానవునికీ దూరమవుతాను." రాజు రైతును చాల అభినందించాడు.

("ప్లేట్ ఆఫ్ గోల్డు" చదివి)

## సీతాకోక చిలుక

★

శ్రీ॥ కోటి

★

రంగు రంగుల రెక్కలతో
రమ్య మైనదీ చిలకమ్మ!
బంతి పూవుపై వాలింది
సీతాకోక చిలుకమ్మ!

ఆటకు తోడెవరు లేరో
ఒంటరిగానే వచ్చింది
అమ్మా, నాన్న లేరేమె
విచారంగా కూచుంది!

ఆటకు రమ్మంటే తోడుగా
నేస్తం నాతో కడుతుందో!
చెలిమి కట్టి చెంతకు నేవెడితే
తుర్రున ఎగిరే పోతుందో!

అయితే గమత్తు చేస్తాను
వెనుక మారుగా వెళ్తాను
చప్పున రెక్కలు పట్టుకొని
ఇంటికి తీసుక వస్తాను.

అంటూ మెల్లన నేవెళ్తే
ఎట్లా నన్నూ చూసిందో
రెపరెప ఎగిరే పోయింది
చమ్కీ టోపీ వేసింది!

# గొప్పతనం

పూర్వం ఒకరాజు వుండేవాడు అతడొకనాడు మారు వేషంతో వేటకు వెళ్ళాడు. అలా తిరుగుతూండగా, ఒక పొలంలో గొల్లపిల్లవాడెంతో సంతోషంగా పాట పాడుకుంటూ, గంతులు వేస్తూ గొఱ్ఱెలను మేపుకోవడం కంట బడింది. రాజుకి వాడి ఆనందంచూస్తే ఆశ్చర్యంతోపాటు కాస్త అసూయ కూడా వేసింది. వాడికి ఒంటినిండా గుడ్డయినా లేదు, గోచిమాత్రం పెట్టు కున్నాడు. అంత బీదవాడు పంచ భక్ష్య పరమాన్నాలతో భోజనం చేయగలడా? మరి వాడి అంతులేని ఆనందం దేనికో అంతుబట్టక రాజు వాడి దగ్గరకు వెళ్ళాడు. "గొల్ల వాడా! నువ్వింత సంతోషంగా ఎందుకున్నావ్" అని అడిగేడు. ఆ గొల్లవాడికి మారువేషంలో వున్నది రాజుగారని తెలియదు. గొల్లవాడు నిర్లక్ష్యంగా "ఏం! రాజే నాకంటే గొప్పవాడు కానప్పుడు నేను సంతోషంగా ఎందుకుండకూడదూ?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

దీనికి రాజు మరింత తికమక పడ్డాడు "నిజంగా నా! రాజు కంటె నువ్వెలా గొప్పవాడివి? నీకేమైనా మడిమాన్యాలున్నాయా?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

గొల్లపిల్లవాడు ఫక్కున నవ్వాడు. "మడిమాన్యాలెందుకు? ఈ నీలి ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు రాజగారికెంత కాంతి నిస్తున్నాడో, నాకూ అంతే యిస్తున్నాడు చంద్రుడు వెన్నెల నిస్తున్నాడు. చుట్టుపట్లవున్న చెట్లూ చేమలూ, నదులూ పర్వతాలు చక్కని ప్రకృతి సౌందర్యాన్ని నాకందిస్తున్నాయి గలగల పారేటి సెలయేరులు తియ్యటి నీటిని త్రాగటాని కందిస్తున్నాయి. ప్రతిరోజూ తినటాని కేదో యింత వున్నది. నాకు సరిపడిన గుడ్డలు వున్నాయి. నాకు కావలసిన డబ్బు నేను సంపాదించుకోగలను. రాజుకుండే రాజ్యభారం నాకు లేదు. అందుకే నేనింత సంతోషంతో నిర్విచారంగా వున్నాను మీరిప్పుడు చెప్పండి— రాజుగారికి నాకంటె ఎక్కువ ఏమున్నాయో!" అని ప్రశ్న వేశాడు గొల్లవాడు.

రాజుగారి ముఖం గొల్లవాడి అమాయకత్వం ఆనందానికి సంతోషంతో వికసించింది. గొల్లవాడితో "నాయనా! నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. రాజుకంటె నువ్వే గొప్పవాడివి. ఆ సంగతి రాజే నీతో స్వయంగా చెప్పాడన్న నువ్వు ప్రజలకు చెప్పవచ్చు" అని గిఱ్ఱున గుఱ్ఱమెక్కి వెళ్ళిపోయాడు. తానింతవరకూ మాట్లాడింది రాజుతోనని తెలిసికొని, గొల్లపిల్లవాడు స్తబ్ధుడయ్యాడు. ★

మందరపు పద్మ, లలిత



"చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగ శోణే"




# 25
## దక్షిణ ధ్రువం

అటుపిమ్మట విశాల సముద్రం కనిపించిందన్న వార్త తెలియగానే నేనా అద్భుతం పరిశీలించి చూడడానికి నాటిలస్ టాపుమీదికి వెళ్ళిపోయాను. నేను విన్న మాట అబద్ధం కాదు. కనుచూపుమేర ఎదురుగుండా ఇంకా మహాసముద్రమే కనపడింది. ఉష్ణమాపకయంత్రంకేసి చూస్తే అది సెంటిగ్రేడ్ కింకా మూడు డిగ్రీలు తక్కువగానే ఉంది.

"మనం దక్షిణధ్రువం దగ్గిరికి వచ్చివేశామా?"

అని ఎంతో కంగారుగా ప్రశ్నించాను నా ప్రక్కనే నిలబడిన కెప్టెన్ వైపు చూచి.

"ఇంకా తెలియదు మధ్యాహ్నం 12 గంటలకు మనం ఎక్కడ ఉన్నదీ తెలుసుకోవచ్చును." అన్నాడు కెప్టెన్.

మరొక పదిమైళ్ళ దూరంలో చిన్న ద్వీపము, దానిమీద ఒక కొండ కనిపించాయి. ఆ కొండ ఎత్తు 6 వందల అడుగులుండవచ్చును.

అలాగ సుమారొక గంటసేపు ప్రయాణంచేసి, మేమాద్వీపం చేరుకొన్నాము దానిచుట్టూ ఎన్నెన్నో మంచుగుట్టలున్నాయి.

మేమా ద్వీపం ఒడ్డుదాకా పోకుండా కొంచెం సమీపంలోనే జలాంతర్గామి నిలిపివేశాము తరవాత జలాంతర్గామి నావ సీటిలో విడిచిపెట్టారు కెప్టెన్, యంత్ర పరికరాలు చేత్తో పట్టుకొన్న మరి ఇద్దరు నావికులు ఆ నావలో కెక్కారు. నేను కౌన్సెలు కూడా ఆ నావ ఎక్కాము. నెడ్‌లాండ్ మాతో రాలేదు అతడేదో తిక్కలో ఉన్నట్లు కనబడ్డాడు. అందుచేత మేమతన్ని జలాంతర్గామిలోనే విడిచిపెట్టివేశాము.

మా నావ నాలుగైదు నిమిషాలలో ద్వీపం జేరుకుంది కౌన్సెలు ముందుగా దిగబోయాడు. నేనతన్ని ఆపివేశాను:

"ప్రొఫెసర్! మానవులెవరు తొక్కిచూడని ఈ భూభాగంలో మొట్టమొదటగా అడుగుపెట్టిన గౌరవం ముందుగా మీకే దక్కాలి." అని ఎంతో గౌరవంగా నీమో వైపు చూచాను

నీమో నామాటకెంతో సంతోషించాడు. మొట్టమొదటగా తనే ఆద్వీపంలో అడుగుపెట్టాడు. తరవాత మేమిద్దరము దిగాము. మిగిలిన నావికులిద్దరు నావలోనే ఉండిపోయారు.

ఆ ద్వీపంలో కనిపించిన వస్న

అనువాదం: "వినాయక"

చాలా చిత్రమైన చెట్లు. మేమక్కడ అడుగుపెట్టగానే రకరకాల రంగు రంగుల పక్షులు లొక్కుమారుగా ఆకాశంలో కెగిరాయి. అవి ఎన్ని వేల పక్షులుంటాయో ఎవరు చెప్పగలరు.

అంతవరకు మాకు సూర్య దర్శనం కాలేదు. చుట్టూరా మంచు కురుస్తూండడంవల్ల ఏదీ స్పష్టంగా కనిపించడంలేదు. మేము దక్షిణ ధ్రువం దగ్గిరికి చేరుకున్నామో లేదో తెలుసుకోవడ మెలాగ?

అప్పటికి పన్నెండుగంట లైంది. అయినా సూర్యుడు కనబడలేదు. కేప్టెన్ సిమో కేమిచెయ్యడానికీ పాలుపోలేదు.

"ఈ వేళకి తిరిగివెళ్ళి మళ్ళీ రేపు వద్దాము." అన్నాడు.

తరవాత మేమంతా జలాంతర్గామి లోకి వెళ్ళిపోయాము.

ఆ మరునాడు కౌన్సెలు నేను మాత్రమే ముందుగా నావలో ఎక్కి ఆ ద్వీపం చేరుకొన్నాము.

ఆ ద్వీపంలో కొంతదూరం నడిచేసరికి మాకు వేలాది సముద్ర సింహా లెదురయ్యాయి ఆ సముద్ర సింహాలకు మేమెరిగిన సముద్ర సింహాలకు కొన్ని చిన్న చిన్న తేడాలున్నాయి.

మేమిద్దరము వాటికి దగ్గరగా వెళ్ళిపోయాను. అయినా మనుష్యుల నెప్పుడు చూడకపోవడంవల్ల అవి బెదరిపోలేదు. వాటిల్లో కొన్నింటి పొడవు 12 అడుగులు.

అలాంటి చిత్రమైన జంతువులక్కడ చాలా ఉన్నాయి. నెడ్ లాండ్ మాతో వచ్చివుంటే వెనకా ముందూ చూడకుండా వాటిలో చాలావాటిని వేటాడేసి ఉండేవాడే!

అందుచేత అతగాడు మావెంట రాకపోవడం మంచికే వచ్చిందని అనుకొన్నాను.

నేనా తరవాత జలాంతర్గామికి తిరిగి వెళ్ళిపోవాలని అనుకొన్నాను. అంతలో కెప్టెన్ నీమో అప్పుడే ఆ నావ దిగి అక్కడికి వచ్చాడు. అతడు తనతో మరికొన్ని యంత్రాలుకూడా తీసుకువచ్చాడు. అతడు ఉత్తరదిశగా తిరిగి రెప్పపాటులేకుండా నిశ్చలంగా ఏదో చూస్తున్నాడు. నేనతని పక్కనే నిలబడ్డాను. అత డలాగే చూచాడు.

అప్పుడే మధ్యాహ్నం పన్నెండు గంటలు కావచ్చింది.

అయినా సూర్యుడు కనపడ లేదు. వందలాది సాగర సింహా లాపక్కనే రాళ్ళమీద పడుకొని నిద్రపోతున్నాయి.

మే మా ప్రాంతానికి మార్చి నెల లోనే జేరుకొన్నాము. ఆనాడు మార్చి 21-వ తేదీ. కెప్టెన్ నీమో సరిగా ఆనాడే అక్కడ జేరుకోవడానికొక కారణం ఉంది.

దక్షిణధ్రువంలో ఆరుమాసాలు కటిక చీకటి. ఆరుమాసాలు పట్ట

## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతిదూరంలో సముద్రతీరంగాలమీద ఒక పెద్ద వెలుగు కనిపించింది. ఆ వెలుగు ఒక కొత్త జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కౌన్సెల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. కెప్టెన్‌నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బైటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. కెప్టన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరుచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి గరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది. జలాంతర్గామి వానికొరో ద్వీపంమీగుగా వెళ్లి గీల్బొవాద్వీపానికి సమీపంలో నిలబడుతుంది. అరోనా అనుచరులతో కలిసి ఆ ద్వీపంలో ప్రవేశిస్తాడు. ముగ్గురు గిల్బొవా ద్వీపంలో వేటముగించుకొనివస్తూండగా హఠాత్తుగా ఒక రాయి వారిదగర పడుతుంది. పిమ్మట కెప్టెన్ నీమో వజ్రాయుధంతో ఆటవికుల నందరినీ హడలగొట్టి వేస్తాడు. క్రమంగా జలాంతర్గామి పగడాలదీవి జేరుకుంటుంది చనిపోయిన నావికుని కొకనికి అక్కడ సమాధి ఏర్పాటుచేస్తారు. కెప్టెన్ నీమో మన్నారు సింధుశాఖలో ఒక పెద్దముత్యం సంపాదిస్తాడు పిమ్మట ఎంతో సాకచక్యంతో ఒక బెస్తవాని ప్రాణాలు సంరక్షిస్తాడు పిమ్మట జలాంతర్గామి మధ్యధరాసముద్రం దాటి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశిసుంది తరవాత జలాంతర్గామి నావికులు విగో అఖాతంలో మునిగి వెండిబంగారాల పోగులు సేకరిస్తారు. కెప్టెన్‌నీమో ప్రొఫెసర్ అరోనాకు అట్లాంటిస్ ఖండం చూపిస్తాడు. జలాంతర్గామి సముద్రం అట్టడుగున ఉన్న బొగ్గుగనులలోనించి బొగ్గు నింపుకుంటుంది క్రమంగా గుర్భేద్యమైన మంచుకొండ అడుగునించి ప్రయాణంచేసి దక్షిణధ్రువం సమీపిస్తుంది

## సాగరగర్భంలో సాహసయాత్ర

పగలు! మార్చి 21 దాటిన తరవాత అక్కడ రాత్రి ప్రారంభం అవుతుంది.

21-వ తేదీని మధ్యాహ్నం పన్నెండుగంటలకు సూర్య బింబం సరిగా సగం వరకు అస్తమించిందంటే ఆ ప్రదేశం దక్షిణధ్రువాని కించు మించుగా నూరుగజాల దూరంలో ఉన్నదన్న మాట. అయితే ఆ లెక్కలో ఏదైనా పొరపాటు తేడా ఉంటే ఉండవచ్చును. దూరదర్శినీ యంత్రాల సహాయంతో ఆ తేడా లేకుండా చేస్తే దక్షిణధ్రువం ఉన్న ప్రదేశం పట్టుకోవచ్చును. కెప్టెన్ నిమో ఆ లెక్కలు తేల్చుకోడానికే ఆ ప్రదేశంలో అంత జాగ్రత్తగా పరిశోధనలు సాగిస్తున్నాడు. ఆ నాటితో అతని పరిశోధనలన్నీ పూర్తి అయిపోయాయి.

ఆ మర్నాడు మేమంతా మళ్ళీ ఆ ద్వీపానికి చేరుకొన్నాము. కెప్టెన్ నిమో ఆ ద్వీపంలో బాగా ఎత్తుగా ఉన్న పర్వతశిఖరం పైభాగానికి ప్రయాణమైనాడు. ఆ పర్వతం ఎక్కడమంటే మాటలతో పని గాదు. అయినా కెప్టెన్ నిమో ఎంతో జాగ్రత్తగా ఆ పర్వతశిఖరం మీదికి వెళ్ళిపోయాడు. కొన్సెలు, నేను అతనివెంటనే నడిచాము. మాతో వచ్చిన నావికులిద్దరు మా అడుగుల్లో అడుగులు వేసుకొంటూ పైకెక్కి వచ్చారు.

అప్పటికి తొమ్మిదిగంటలైంది. ఆకాశం అంతా నిర్మలంగా ఉంది. మబ్బులన్నీ క్రమక్రమంగా మంచు విడిపోయినట్లు విడిపోయాయి. కెప్టెన్

సీమో ఆ పర్వతశిఖరం చిట్టచివరి భాగంలో తన యంత్రాలన్నీ అమర్చి అతి జాగ్రత్తగా పరిశీలించడం ప్రారంభించాడు.

పావు తక్కువ పన్నెండు గంట లయింది. సూర్యబింబం మా కప్పుడొక బంగారుచక్రంలా కనిపించింది. కెప్టెన్ సీమో గడియారం కేసి చూస్తున్నాడు. గడియారంలో 12 గంటలయ్యేసరికి సూర్యబింబం సరిగా సగం వరకు అస్తమించిందంటే మేమున్న ప్రదేశం దక్షిణ ధ్రువం అన్నమాటే!

ఇంతకుపూర్వం చరిత్రలో ఎవ్వరు దక్షిణధ్రువం ఎక్కడ ఉన్నదీ నిర్ణయించలేదు. అసలు చాలామంది మేమున్న ప్రదేశానికి నూరు మైళ్ళ దూరందాకానైనా రాలేదు. ఎంతోమంది దారిలోనే సముద్రంలో మునిగిపోయారు. మరికొంత మంది ఓడలు మంచుకొండలకు ఢీకొని తునాతునకలై పోయాయి.

అయినా పాశ్చాత్య దేశాల భూగోళ శాస్త్రపరిశోధకు లంత మాత్రం చేత నిరుత్సాహపడిపోలేదు. తండోపతండాలుగా దక్షిణ ధ్రువంవైపు ప్రయాణాలు సాగించారు. అలాగే మధ్యదారిలోనే సముద్రంలో మునిగిపోయారు.

కెప్టెన్ సీమో ఒక్కడే అనేకమైన ఆఘాతాలెదుర్కొని దక్షిణ ధ్రువం దగ్గరికి చేరుకొన్నాడు. అదృష్టవశాత్తు అతనిగడియారంలో 12 గంటలయ్యేసరికి సూర్యుని అర్థాస్తమయం జరిగిందంటే అతడు దక్షిణ ధ్రువం చేరుకున్నాడన్నమాటే!

నేనతని చేతిలోఉన్న వాచీ ముల్లుకేసి చూశాను. నా గుండె గబగబా కొట్టుకోవడం మొదలు పెట్టింది. ముల్లు మెల్లిగా నడుస్తున్నా గబగబా పరుగెత్తుకుపోతున్నట్లే కనిపించింది.

వాచీలో సరిగా పన్నెండుగంట లయింది. నేను పట్టరాని ఆవేశంతో "సరిగా పన్నెండుగంట లయింది!"

అని అరిచాను. సరిగా అదే సమయంలో సూర్యబింబం సరిగా సగంవరకు అస్తమించింది. కెప్టెన్ సీమో ఇంకొక యంత్రంతో ఆ విషయం అతిజాగ్రత్తగా పరిశీలించాడు. సూర్యబింబం సరిగా సగమే అస్తమించింది అతడు నన్నుకూడా ఆ యంత్రం అద్దంకేసి చూడమని సంజ్ఞచేశాడు. నేనూ చూశాను. సూర్యబింబం సరిగా సగమే అస్తమించింది. సందేహంలేదు.

కెప్టెన్ సీమో పట్టరాని ఆవేశంతో—

"మనం నిలబడిఉన్నదే దక్షిణ ధ్రువం!"

అన్నాడెంతో ఉత్సాహంతో. తరవాత కెప్టెన్ సీమో నాబుజం మీద చెయ్యివేసి గంభీరంగా ఇలా గన్నాడు:

"మార్చి 21-వ తేదీని నేను ఇంతకుపూర్వం ఎవరూ కనిపెట్టలేని దక్షిణధ్రువం కనిపెట్టాను. ఈ భూభాగం అంతా నా స్వాధీనం చేసుకొంటున్నాను."

"ఇదంతా ఎవరిపేరుతో స్వాధీనం చేసుకొంటున్నారు?" అన్నాను.

"మరి ఒకరి పేరెందుకు? నాపేరుతోనే! నేను సర్వస్వతంత్రుణ్ణి!"

అనిచెప్పి కెప్టెన్ సీమో అక్కడ తన పతాకం ఆవిష్కరించాడు.

అది నల్లని జెండా. దానిమీద 'ఎన్' అనే అక్షరం బంగారు రంగుతో చిత్రించారు.

అంతలో సూర్యాస్తమయం అయింది.

"నా రాజ్యంలో అప్పుడే సూర్యునిఆధిపత్యం అస్తమించింది." అన్నాడు కెప్టెన్. మేమంతా ఆ సాయంకాల సౌందర్యం చూస్తూ కొంతసేపటివరకు అలాగే నిలుచుండిపోయాను. (ఇంకా ఉంది)

# వనితా లోకం

## 'వదినా మరదళ్ల గోష్ఠి' ★★ తీరిక సమయాలలో గృహ పరిశ్రమలు

# చాక్లెట్లు చేసే పద్ధతి

ఇంట్లో చిన్న పిల్లలు సాధారణంగా చిరుతిండి కోసం మారాం చేస్తూ వుంటారు. మన స్త్రీలలోనే కొంచెం ఓపిక పట్టలేనివాళ్లు వాళ్ల మారాం చూచి మొదట కొంచెంసేపు వూరుకున్నా, చివరకు వాళ్లవీపుమీద రెండు అంటించి వొదుల్తారు.

ఆ కొట్టటానికి ఒక కారణం ఆర్థిక దుస్థితే కావచ్చు స్థితిమంతులు అయినా ప్రొద్దస్తమానం ప్రాణం విసిగిస్తూ వుంటే, ఇంక శాంతం వహించలేక వీపు చిట్లగొట్టే వాళ్లూ వున్నారు. మధ్యతరగతి కుటుంబాలలో నలుగైదుగురు పిల్లలుంటే, వాళ్లందరికీ కొని పెట్టటం కష్టమే.

సాధారణంగా పిలలున్న ఇళ్లల్లో ఒక పౌను బిళ్లలో, బిస్కట్లో, చాక్లెట్లో, కొని ఏడ్చినపుడల్లా పెడుతూ వుంటారు.

* * *

"స్త్రీలు తెలివితేటలు, నేర్పుగలవారైతే, ఒక పౌను బిళ్లలకు ఖర్చు పెట్టే సొమ్ముతో నాలుపౌనుల బిళ్లలు ఇంటిలోనే తయారుచేసుకో వచ్చు. నిజమే నంటావా?"

"నిజమే కాని, వొదినా! ఆ ప్రయత్నం చేయకపోవడానికి అశ్రద్ధే ముఖ్యకారణం. అసలు తయారుచేసే పద్ధతులు తెలియకపోవటం మరొక కారణం. పోతే, నీవోటి వాళ్లు చేసేపద్ధతి చెబుతామంటే సంతోషంగా నేర్చుకుని తప్పకుండా, తయారు చేస్తా."

"ఈమాటు చాక్లెట్లు తయారుచేసే పద్ధతి చెబుతా విను."

"ముందు చాక్లెట్లు చేసేందుకు ఏయే వస్తువులు కావాలో చెప్పు."

"ఎన్నో వస్తువులు అక్కరలేదు:
పంచదార ఒక పౌను.
పాలు అయిదు ఔన్సులు.
మెత్తగా తురిమిన కొబ్బరి 15 తులాలు.
కోకో పౌడరు $2\frac{1}{2}$ తులాలు"

"వీటిని తెచ్చి ఏమి చెయ్యాలి?"

"ముందుగా ఒక పళ్లెమును నెయ్యిరాచి సిద్ధంగా వుంచుకోవాలి. తరవాత పంచదార ఒక నోరువెడల్పు గిన్నెలో వేసి పాలుపోసి గిన్నెను కుంపటిమీద పెట్టి, బాగా విసరాలి కొంతసేపటికి పంచదార పాలలో కరిగిపోయి పాకం కావడం ప్రారంభిస్తుంది. పాకం చాల త్వరగానే వస్తుంది"

"తరువాత ఏమి చెయ్యాలి?"

"తరువాత 15 తులాలు ఎండు కొబ్బరి–కుళ్లువాసన లేనిది–తెచ్చి సన్నగా తురమాలి"

"పచ్చి కొబ్బరి పనికిరాదా?"

"పనికిరాదు. పచ్చికొబ్బరి 4 5 రోజులు నిలవవుంటే, కుళ్లువాసన వస్తుంది"

"పంచదార పాకంలో వేసి వండుతున్నాంకదూ?"

"పాకంలో వేసిన కొబ్బరి ఉడికేవరకూ పొయ్యిమీద వుంచనక్కరలేదు; పాకంలో వేసి, బాగా కలిసేవరకు కలిపి వెంటనే దింపివేయాలి"

"తరువాత?"

"కాగి సిద్ధంగా వున్న పంచదార పాకంలోనుంచి సగం వేరే ఒక గిన్నెలోకి తీసి, అందులో తురిమిన ఎండు కొబ్బరి వేసి, బాగా కలిపి, దానిని వెంటనే నెయ్యి రాచి సిద్ధంగా వుంచిన పళ్లెంలోకి మార్చి అంతటా వచ్చేటట్లుగా పల్చగా నెరపాలి.

"మిగతా సగం పాకం ఏం చెయ్యాలి?"

"మిగతా పాకంలో $2\frac{1}{2}$ తులాలు కోకో పౌడరు తూచివేసి, బాగా కలిసిపోయేట్లు కలపాలి కొంచంసేపు అయినాక దానిని మొదట పోసిన పాకంమీదపోసి దీనినికూడ మొదటి పాకం వున్నంతవరకు పల్చగా తట్టాలి కొంతసేపటికి మొదటి పాకం, రెండవమారు పోసిన పాకం గట్టిపడుతుంది. వెంటనే ఒక చాకుతో $\frac{3}{4}$ అంగుళం వెడల్పుగా వంకరలేకుండా, మూడు అంగుళాల పొడుగున కోసి బాగా గట్టిపడిన తరువాత విరిగిపోకుండా తీసి మైనపు కాగితాల్లో దాచుకోవచ్చు."

"కోకో పౌడరుకు బదులుగా ఓవల్టిన్ కలపవచ్చా"

"ఎందుకు కలపకూడదు? చాల బలంగా కూడ వుంటుంది"

"ఇలా తయారైన చాక్లెటు అడుగుభాగం తెల్లని రంగులో కొబ్బరితో కలిసి వుండి, పైభాగం సువాసనగా ఇంకొక రంగులో వుంటుంది కదూ?"

"అవును. దీనినే ఇంకొక విధంగా చేస్తే ఇంకా బాగుంటుంది"

"ఏవిధంగా!"

"మొత్తం పాకాన్ని 3 భాగాలు చేసి ఒక భాగంలో ఓవల్టిన్ గాని, కోకో గాని కలిపి దానిని నెయ్యిరాచిన పళ్లెంలో అడుగుభాగాన పోయాలి. దానిపైన కొబ్బరి కలిపిన పాకం పోసి, పైన 3–వ పొరగా



స్థలజలజం

# రోగుల మనస్తత్వంపై పుస్తకాల ప్రభావం

గడచిన మాసంలో గ్రంథాలయ మహాసభలు హైదరాబాదు నగరంలో జరిగిన సందర్భాన కేంద్ర దేశీయాంగవ్యవహారాల ఉపమంత్రి శ్రీ బి. యస్. దాతార్ ఉస్మానియా జనరల్ హాస్పిటల్లో గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు. దీన్ని రోగుల కొరకు ప్రత్యేకంగా నెలకొల్పారు.

వైద్యాలయాలలో దీర్ఘ వ్యాధులతో బాధపడుతూ, సంవత్సరాల తరబడి చికిత్స పొందుతున్న రోగులు అసంఖ్యాకంగా ఉంటారు. ఇల్లు వదలి, ఆప్తులకు దూరంగా వైద్యాలయాలలో సంవత్సరాలతరబడి వుండవలసివస్తే, మనసు క్రుంగిపోతుంది. వ్యాధి దేహాన్ని బాధిస్తే, దేహదౌర్బల్యం మానసికాందోళనకు కారణమవుతుంది. శారీరకమయిన బాధలలో ప్రతి ఒక రకాన్నీ అనుసరించిన వాటితో మనసుకూడా దిగనాసిల్లిపోతుంది. ఔషధానికి ఉపచారం తోడయితే నేగాని, రోగికి ఆరోగ్యం చేకూరదు. రోగికి ఔషధోపచారాలచేత ఆరోగ్యం సమకూరుతుంది; గాని మనసు కుదుటబడినప్పుడే, ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. వైద్యాలయాలలో ఉపచారికల అమృతవాక్కులచేతనూ, చల్లటి పలుకరింపులవల్లనూ రోగులకు బాధ ఉపశమించినట్లుంటుంది. ఔషధాలతో బాధోపశమనమయేలోపల, గిలగిల కొట్టుకొనిపోయే రోగులకు ఉపచారికలే కన్నతల్లులవుతారు. వారి పలుకులే అమృతతుల్యాలుగా ఉంటాయి. ఈ కన్నతల్లుల సంరక్షణలో రోగుల ఆరోగ్యము క్రమక్రమంగా అభివృద్ధి చెందుతుంది.

ఈ ఉపచారికల చల్లటి మాటలవలెనే గ్రంథపఠనం మానసికమయిన అస్వస్థతకు చికిత్స చేసి బలాన్ని చేకూర్చగలిగినది. గ్రంథపఠనంలో లయమయిన మనసు తేరుకొని, ప్రశాంతమయిన పరిస్థితికి రావటానికి వీలు కలుగుతుంది. మనసు అన్యవిషయాసక్తమయినప్పుడే బాధలు మరుగునబడి శీఘ్రారోగ్యము చేకూరుతుందని మనస్తత్వ వైద్యులు పరిశోధనచేసి తెలుపుతున్నారు. వైద్యులందరు దీనిని ఆమోదించారు. రోగులకు శారీరకంగా కాకుండా, ఆర్థిక సాంఘిక భావాత్మకంగా కూడా జరిగిన చికిత్సనె సమగ్రమయిన సంపూర్ణ చికిత్సగా భావించవీలవుతుంది.

## చాక్లెట్లు చేసేపద్ధతి

కోకో కలిపిన పాకంపోస్తే, అడుగునా పైనా ఒకే రంగు కలిగి రుచిగా వుండి, మధ్యభాగంలో మాత్రం కొబ్బరి కలిపిన పాకం వుంటుంది."

"దీనిలో ఎసెన్సు వెయ్యాలా?"

"పంచదార పాకం రాగానే కొద్దిగా 'వానిలా ఎసెన్సు' కలపాలి. ఈ చాక్లెట్లు ఎంతో రుచిగా వుంటాయి. బజారులో ఎంతో ఖరీదుకు అమ్ముతారు. తప్పకుండా తయారు చేస్తావు గదూ?"

"తప్పకుండా"

ఇల్లిందల సరస్వతీదేవి

★

# ★ రోగులపై పుస్తకాల ప్రభావం ★

కరుకుతనంతో, కాఠిన్యంగా కార్పణ్యంతో, అసహనంతో, తొందరపాటుగా మాటాడే స్వభావంగల ఉపచారిక రోగులకు బాధోపశమనము కావించి ప్రశాంత తను చేకూర్పలేదు. ఆమె మాటలలో మాధుర్యం, లాలన, బుజ్జగింపు ఉంటేనే రోగికి బాధోపశమనమయి, మనస్సుకు హాయికలుగుతుంది.



ఆదర్శవంతమైన ఉపచారికతో సరితూగగలిగినది. గ్రంథపఠనం. ఉపచారికకు పలుకులో మాధుర్యం, సేవలో దాక్షిణ్యం ఉన్నప్పుడే రోగికి బాధోపశమనం కలుగుతుంది ఆ విధముగానే గ్రంథపఠనం కూడా మానసికంగా రోగులకు బాధోపశమనం చేయకలిగి ఉండాలి.

రోగులకొరకు వ్యవస్థీకరించిన, గ్రంథాలయాలలో చేర్పటానికి అన్ని రకాల గ్రంథాలు ఉపయోగకరంగా ఉండవు. అవి రోగులకు భావోద్రేకాన్ని కలిగించి, విపరీతమైన పరిణామాలకు దారితీసేఅవకాశం వున్నది. ఈ దుష్పరిణామంవల్ల కోలుకోవటానికి బదులుగా రోగులు క్రుంగిపోతారు. వారు ఏ వ్యాధులతో బాధపడుతూ ఉంటారో, ఆ వ్యాధులను వర్ణించి వివరించే గ్రంథాలు పనికిరావు. శృంగార వర్ణనలతో రోగులకు భావోద్రేకాన్ని కలిగించనివిగా కూడా ఉండాలి మెదడుకు అతిగా పని కల్పించని, తేలిక రకపు గ్రంథాలు ఉపయోగకరంగా, ఉంటాయి. అపరాధ పరిశోధక నవలలు, కథలు చాలా మందిని ఆకర్షించి ఉత్సాహాన్ని కలిగిస్తాయి. కాని అకారణ మరణాలు, ముఖ్యంగా వైద్యాలయాలలో చనిపోయిన వారి కథలు, వైద్యుల నిర్లక్ష్యం, రోగుల జీవన్మరణ సమస్యలు, విఫలమయిన ఆపరేషన్ కేసులు, ఆత్మహత్యలు మొదలయిన వాటి వివరాలతో కూడినవి రోగులకు కూడని మానసికాందోళన కలిగించి ప్రమాదకరమయిన పరిస్థితులకు దారి తీయగలవు.

రోగులకు మనశ్శాంతి కరమయిన గ్రంథాలు బైబులు, భగవద్గీత, రామకృష్ణ పరమహంస, సమర్థ రామదాసస్వామి వంటి మహాపురుషుల జీవితచరిత్రలు, వివేకానందుడి రచనలు - ఇంకా ఇటువంటి ప్రబోధాత్మకమైనవి. ఇవి భావోద్రేకాన్ని ఏమాత్రం కలిగించవు. కొంతమందికి విజ్ఞాన శాస్త్రసంబంధమైన గ్రంథాలు ప్రీతిని కలిగిస్తాయి. లలిత కళలకు సంబంధించిన గ్రంథాలుకొందరికి ఉల్లాసాన్ని కలిగిస్తాయి హాస్యం, చమత్కారం, ప్రస్ఫుటమయిన నాటకాలు, చారిత్రాత్మక కథలు, నవలలు ఉపయోగకరంగా ఉంటాయి. వృత్తులకు సంబంధించిన గ్రంథాలు రోగులకు ఆశాజనకంగాఉంటాయి. దేహారోగ్యంకోలుకొన్న తరువాత తమ కభిమానవృత్తిలో ప్రవేశం కలిగించుకోవాలని రోగులు వేగిరపడుతూ, త్వరలో ఆరోగ్యాన్ని చేకూర్చుకొనకలుగుతారు.

> ## బంధుమిత్ర సపరివారంగా...
>
> జైలులో ఉన్న ఖైదీలను చూచిపోవడానికి అడపా తడపా చుట్టాలో స్నేహితులో వస్తూనే ఉన్నారుగాని, ఒక్క ఖైదీకిమాత్రం, అలా చూడవచ్చేవారెవరూ లేకపోవడంతో జైలర్‌కు జాలి కలిగింది.
>
> "ఏమోయ్ నిన్ను చూట్టానికెవరూ రారేం? చుట్టాలు, పక్కాలు, జతగాళ్లూ — నా అన్నవాళ్ళెవరూ లేరుకాబోలు పాపం," అన్నాడు.
>
> "ఎంతమాట! నా బలగం అంతా ఇక్కడే నాతోనే ఉందండి బాబయ్యా," అన్నాడు ఖైదీ వినయంగా.

ఈరకపు గ్రంథాలయాలలో వుంచే గ్రంథాలు పెద్దఅచ్చులో ప్రచురింపబడాలి. రోగుల కంటిదృష్టికి ఏవిధమైన శ్రమనూ కలిగించనంత పెద్దఅచ్చులో ఉండాలి. గ్రంథాల బరువు ఎక్కువగావుండి రోగులకు భారం మనిపించకూడదు. చాలామంది రోగులు పడక మీదఉండి గ్రంథపఠన చేస్తారు. కనుక తేలికయిన అట్టలతో గ్రంథాలను బైండు చేయాలి. గ్రంథాలయానికి, రోగులను దృష్టియందుంచుకొని, గ్రంథాలను సేకరించాలి. విరాళంగా ఎన్ని గ్రంథాలను సేకరించినప్పటికీ, రోగుల అభ్యుదయదృష్ట్యా ఈరకపు గ్రంథాలయాలలో వాటిని చేర్పరాదు. ఈ గ్రంథాలచే ఏజాతికాజాతి విషయాన్ని బట్టి విభజనచేసి, నిర్ణీతమయిన స్థలాలలో భద్రపరచాలి.

ఈ గ్రంథాలయాలలో గ్రంథపాలకులుగా పనిచేయటానికి గ్రంథాలయ శిక్షణ పొందినవారు అర్హులు. కానివారికి గ్రంథాలయ శిక్షణ ఒక్కటేచాలదు. ఉపచారకులుగా శిక్షణ పొందిఉండటంకూడా దీనికి ముఖ్యం. అటువంటివారే రోగులను గురించి రోగాలను గురించి చక్కగా తెలిసికొని, తదనుగుణంగా మసలుకోగలుగుతారు.

గ్రంథాలయాలలో పనిచేసే ఉపచారికల బాధ్యత కేవలము రోగులు కోరిన గ్రంథా

లను చేతి కందించటమే కాదు. ఏ వ్యాధితో బాధపడుతున్న రోగికి, ఏవిధమయిన గ్రంథ పఠనంవల్ల లాభం కలుగచేయవలెనో వీరు గ్రహించగలిగి ఉండాలి. మానసికమయిన వ్యాధులతో పీడింపబడే రోగుల పరిస్థితి వైద్యులకయినా సులభంగా అర్థము కాకుండా ఉంటుంది. అటువంటి రోగుల స్వభావాలను పరిశీలించి వారి మనోభావాలను దక్కగా గ్రహించితే గానిఏవిధమయిన నిర్ణయమూ చేయటానికి వీలు లేదు. వైద్యాలయాలలో వైద్యులకు గాని, ఉపచారికలకు గాని రోగుల స్వభావాలను సూక్ష్మంగా పరిశీలన చేయటానికి తగిన అవకాశం ఉండదు. ఈ బాధ్యత వహించవలసినవారు గ్రంథాలయ ఉపచారికలు. రోగుల గ్రంథ పఠనం చేతనూ వారి ప్రసంగధోరణివల్లనూ స్వభావాలను గుర్తించ గలుగుతారు. ఏ స్వభావంగలరోగి ఏరకపు గ్రంథాన్ని చదవాలని కుతూహల పడుతూ ఉంటాడో గ్రహించి వైద్యులకు నివేదించ గలుగుతారు.

గ్రంథాలయాలలో పనిచేసే ఉపచారికలు తమ కర్తవ్యాన్ని అతురాలా పాటించకలిగి ఉండాలి. రోగులు తమ బాధలో అతీవ్రతలో వైద్యులమీదగాని ఉపచారికల మీదగాని నేరారోపణచేసి చెప్పే చాడీలకు గాని అప్రస్తుత ప్రసంగాలకు గాని లొంగిపోకూడదు. వాటినన్నిటినీ ఓపికతో విని, సానుభూతితో ఉపశమనము కావించి రోగుల దృష్టిని వారి కనువైన గ్రంథపఠనం పైపుకు మళ్లించాలి ఆ గ్రంథాలలోని సారాంశం టూకీగా చెప్పి వాటి మీద ఆసక్తి కలిగించాలి.

వైద్యాలయాలలో రోగుల కోసం గ్రంథాలయాల నేర్పరచే ఆవశ్యకతను మొట్టమొదట గుర్తించినవారు అమెరికా దేశస్థులు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మొదటి ప్రపంచయుద్ధకాలం నాటికే గ్రంథాలయాల ప్రాముఖ్యతను గ్రహించారు. ప్రభుత్వ ప్రమేయం లేకుండానే సంఘసేవా పరాయణులు వాలంటియర్ హాస్పిటల్ సర్వీసును స్థాపించారు. రోగుల హృదయాలలో ఆనందోల్లాసాలను జనింప చేయటానికీ, ఆశలను రేకెత్తించటానికీ గ్రంథాలయాలు తోడ్పడగలవని ఆశింపబడ్డది. డాక్టర్ రెబిలాయిన్ గ్రంథపఠనం చికిత్సలో ఒక భాగంగా భావించాడు. డాక్టర్ ఫ్రాంక్ ఆర్. పీటర్సన్ వైద్యాలయంలో గ్రంథాలయం ఈ విధంగా పనిచేస్తుందని అన్నాడు. "గ్రంథపఠనము మానసికాందోళన కలిగినప్పుడు దాని నుపశమింప చేస్తుంది. నిరుత్సాహముతో మనసు క్రుంగిపోయినప్పుడు ఉత్సాహం కలిగించి మనోబలాన్ని చేకూరుస్తుంది. గ్రంథపఠనం అన్ని వ్యాధులకు దివ్యౌషధము వంటిది."

"బాధపడే రోగులకు మనశ్శాంతినివ్వగల శక్తి ఒక స్త్రీకే ఉన్నది. స్త్రీలో సహజ మార్దవం, మాతృప్రేమ ప్రజాహిత కార్యాల కెంతయినా తోడ్పడగలవు. గ్రంథపఠనంలో ఉన్న ఔషధోపయోగాన్ని వైద్యులూ వైద్యాలయాలూ ఎంత గ్రహించినా ప్రతి వైద్యాలయంలోనూ, ఒక గ్రంథాలయాన్ని స్థాపించటానికి ముందడుగు వేయలేరు. ఒక వేళ పూనుకొన్నప్పటికీ ఆ కార్యభారాన్ని విజయవంతంగా నిర్వహించలేరు. మహిళలే ఈ పవిత్రవంతమయిన కార్యభారం నిర్వహించ గలుగుతారు.

మన దేశంలో కూడా వైద్యాలయ సంక్షేమసంఘాలను అక్కడక్కడ స్థాపించి వాటిని మహిళలే నిర్వహిస్తున్నారు. కొన్ని చోట్ల గ్రంథాలయాలు వాటి కనుబంధంగా ఏర్పడి పనిచేస్తున్నవి. వైద్యాలయాలలో గ్రంథాలయాలు నడిపే సంస్థలు అవి కేవలం రోగుల కాలక్షేపం కోసమే అనుకోకుండా, గ్రంథ పఠనంలోని ఔషధ శక్తిని కూడా గ్రహించి నిర్వహించాలి

★

# మైనపు బొమ్మలు

దసరాకి బొమ్మలు పెట్టుకోవటమంటే అందరికీ సరదాయే. మనం, యెన్ని రకాల బొమ్మలు కొన్నా, మనంతట మనం చేసినబొమ్మలు పెడితే ఉన్నంత ఆనందం ఉండదు. మనం సాధారణంగా అట్ట బొమ్మలు, గుడ్డబొమ్మలు చేసి కొలువులో పెడుతుంటాము. ఐతే కొవ్వువత్తి బొమ్మలు, లక్క బొమ్మలు చెయ్యడం ఎక్కువమందికి రాదు. మొన్న మా కాలేజీ ఎగ్జిబిషన్‌లో నేను లక్కవి, కొవ్వువత్తులవీ బొమ్మలు చేసి పెట్టాను. చూపులకి చాలా బావుంటై. తేలికలో ఐపోతై ఎక్కువ డబ్బు ఖర్చు చెయ్యలేనివారు వీటని చేసుకుంటే అందంగాను, బాగుగాను, ఉంటుంది. ఖర్చుకూడ ఎక్కువకాదు.

ముందుగా మనకి కావల్సింది మంచి బంకమన్ను. వినాయకచవితికి కొన్న వినాయకుని మట్టి దీనికి చాలా బావుంటుంది. అది దొరక్కపోతే అంతమంచి బంకమన్ను కాకపోయినా పరవాలేదు. కాలవలొడ్డుదో, చెరువుల్లోని మట్టేనో తెచ్చి బాగా తొక్కి రాళ్లూ, చెత్తా ఏమీ లేకుండా శుభ్రంచేసి, రెండు రోజులపాటు దానిమీద నీళ్లుజల్లి, బస్తా కప్పిఉంచితే, మూడోరోజుకి మైనమంత మెత్తగా తయారవుతుంది. దాన్ని ఒక యెత్తైన అంచుగల పళ్లెంగాని, డబ్బాల మూతనుగాని తీసుకొని అందులో బంకమన్నును, ఎత్తుపల్లాలేకుండా అంచువరకూ నిండా పరవాలి

ఇప్పుడు మీకు కావల్సిన రంగు కొవ్వు వత్తులు తెచ్చుకోండి అణా ఖరీదుచేసే కొవ్వొత్తితో చిన్న బొమ్మలు అయితే రెండు, పెద్దబొమ్మ ఒకటి వస్తాయి. దాన్ని బట్టి, మీరు చేసే బొమ్మకి కావలసిన కొవ్వొత్తి తీసుకుని ఉంచుకోండి.

ఆ కొవ్వొత్తిని మట్టి మూకుడులోనో, యినప గిన్నెలోనో వేసి, ఎఱ్ఱగామండే నిప్పులున్న కుంపట్లో పెట్టండి అది కరిగేలోపల మీకు కావలసిన ఆకారంగల బొమ్మ ముందు భాగానికి నూనె రాసి (చాలా కొద్దిగా నూనె రాయాలి) దానిని, పళ్లెంలోని మట్టిలో గుచ్చాలి ఈ గుచ్చేప్పుడే చాలా జాగ్రత్తగా, మట్టి పగలకుండా బొమ్మలోని ముందు భాగమంతా మట్టిలో గుచ్చాలి తర్వాత, గుచ్చిన రెండు నిముషాలకు బొమ్మని చాలా జాగ్రత్తగా మట్టిలోంచీ, మట్టి పగలకుండా బొమ్మ తీసెయ్యాలి ఇదంతా అయ్యే సమయానికి కొవ్వు కరిగి సిద్ధంగా ఉంటుంది. దాన్ని జాగ్రత్తగా పట్టుకుని, బొమ్మ తియ్యగా పడిన ఆ లోతులో పోసెయ్యాలి అంచు ఎంతువరకూ ఆ కొవ్వు పోశెయ్యాలి కొన్ని నిముషములకి ఆ కొవ్వు పోసిన ప్రదేశంలోని కొవ్వంతా గట్టి పడ్తుంది. గోరుతో బొమ్మ ఆకారంలో ఉన్న కొవ్వును జాగ్రత్తగా ఎతితే బొమ్మ, బొమ్మగా ఊడి వస్తుంది. దానికి మట్టి గనక అంటితే చన్నీళ్ళలో ముంచితీసి, తడిగుడ్డతో నెమ్మదిగా మట్టి తుడిచే మట్టి రాలిపోతుంది యిదే విధంగా లక్క కరిగించి పోస్తే లక్క బొమ్మ వస్తుంది. ఎక్కువ ఖర్చు లేకుండా కుదురై. ★

వి. వి. యస్. లక్ష్మి

## ఇది 1956 ...

సిగరెట్లు తాగుతున్న పదేళ్ళ కుర్రాణ్ణి చూచి, దారి వెంట పోయే ఒక మహిళ మందలించబోయింది. "తప్పు కాదూ. నువ్విలా చేస్తున్నావని మీ అమ్మకి చెబితే?" అంది.

"మీరిట్లా పరాయి మొగాళ్ళను నిలేసి పోట్లాడుతున్నారని మీ ఆయనకి చెబితే?" అన్నాడు పదేళ్ళ పురుష పుంగవుడు నిర్లక్ష్యంగా సిగరెట్టు కాలుస్తూ.

## గుండె చికిత్స

గుండెకు శస్త్ర చికిత్స చెయ్యవలసి వస్తే 7 నిముషాల వరకు గుండె ఆపివేసే పద్ధతి ఈ మధ్య కనుకొన్నారట!

ఎడింబరో ఆస్పత్రి డాక్టరు మాక్ కారమాక్ ఈ కొత్త పద్ధతి కని పట్టారు

ఇంతకుపూర్వం గుండె ఇంకా పని చేస్తూండగానే, శస్త్రచికిత్స చేసేవారు.

ఈ కొత్త పద్ధతి ప్రకారం సెంటిగ్రేడ్ లో 25 డిగ్రీల వరకు హృదయం చల్లబడిపోతుంది. ఆ సమయంలోనే 7 నిమిషాలలోగా శస్త్రచికిత్స పొందరగా పూర్తి చెయ్యవచ్చునట!

# డిటెక్టివ్ రామారావు

(9–వ పేజీ తరువాయి)

దొంగను పట్టుకోవటానికి క్షణంకూడా పట్టదు.

రామారావుకు వేయి యేనుగుల బలం లోపలికి ఇంజెక్టు అయినట్లనిపించింది. తన మొదటి కేసు హత్య కేసుగాకుండా చోరీ కేసయినందుకు ఇంతసేపూ పడుతున్న విచారాన్ని అలాగే వదిలేసి నిల్చున్న పాళంగా రోడ్డుప్రక్క ఆగిఉన్న కారులోకి దూకేశాడు. "పోనీ,...పోనీ...ఆ ప్రక్క సందులోంచి వెళ్ళగలిగినంత వేగంగా నడుపు నేనెవరినో తెలుసా? ప్రైవేట్ డిటెక్టివ్ రామారావును!" అంటూ డ్రైవరును ఆజ్ఞాపించాడు

ఇంతసేపూ సీటింగుమీద ఆనుకొని ప్రక్క షాపులోకి చూస్తున్న డ్రైవరు ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు

వెనక సీటులో కూర్చున్న రామారావు ఆ డ్రైవరు మొహం చూసి అంతకన్నా ఎక్కువగా ఉలిక్కిపడ్డాడు అతని గుండెల్లో ఒక్కసారిగా అయిదు అణుబాంబులు ప్రేలినట్లయింది. వెయ్యేనుగుల బలమూ క్షణంలో నీరుగారిపోయింది. "మీరా! ప్రిన్సిపాల్ గారూ! పొరపడాను. క్షమించాలి!" అంటూనే ఆ కార్లోంచి బయటపడ్డాడు.

"అరి భగవాన్! ఎంతపని జరిగిపోయింది! కొంపదీసి ప్రిన్సిపాల్ రేపు కాలేజిలోంచి డిస్మిస్ చేయడుగదా?" అనుకుంటూనే రామారావు అటు ఖాళీగా వస్తున్న ఓ ఆటోరిక్షాను ఆపమని సంజ్ఞ చేస్తూనే లోపలికి దూకేశాడు.

అవును మరి! తన అభిమాన డిటెక్టివ్ లంతా అలా దూకేస్తుంటారేగాని, రిక్షావాడు ఆపేదాకా ముసలమ్మల్లా ఆగి ఎక్కరుగదా! పోనీ! టాపు తగిలి తల బొప్పి కట్టిందే అనుకో, అంతమాత్రాన పోయిందేమిటి? అయినా తాను చేయబోతున్న మహత్తర కార్యంముందు యీ తలబొప్పి ఒక లెక్కలోదా?

ఆటోరిక్షా నాలుగు ఫర్లాంగులూ దాటింది ఎగుడు దిగుడులుగా ఉన్న సందులు గొందులన్నీ దాటి సిమెంటురోడ్డు మీదికి వచ్చింది. రామారావు ఉన్న రెండు కళ్ళతోనూ జాగ్రత్తగా పరిసరాలన్నీ పరిశీలించుకున్నాడు. కాని ఇంతవరకూ ఎక్కడా సైకిలుమీద ట్రాఫిక్ పోలీసు చేతి తిరుమబడుతున్న ఆ గజదొంగ ఎదురవలేదు

రిక్షా ముందుకు సాగిన కొద్దీ రామారావుకు ఉత్సాహం తగ్గిపోసాగింది అయిదు నిమిషాల క్రితం బొడ్డో పర్సుతో ఇటు పరుగెత్తుకొచ్చిన ఆ దొంగవెధవ ఏమయ్యాడు? ఆ ట్రాఫిక్ పోలీసు ఎక్కడ ఏడ్చాడు? ఒక వేళ వాళ్ళిద్దరూ లాలూచీ పడి చెరిసగం పంచుకుని మాయమవలేదుగదా? అనుమానాలతో రామారావు సతమతమవసాగాడు.

ఆటోరిక్షా తిరిగి తిరిగి బయలుదేరిన చోటికే వచ్చి ఆగింది. అందులోంచి డిటెక్టివ్ రామారావు జీవచ్ఛవంలా దిగాడు. పర్సులోంచి ఓ నోటు తీసి రిక్షావాడి కందించాడు. వాడది అందుకొని సంతోషంగా సలాముచేసి వెళ్ళిపోయాడు.

ఆ పెద్దమనిషి ఇంకా అక్కడే ఉన్నాడు. గుంపు ఇంకా ఎక్కువయింది. కాని రామారావుకు యీసారి అటు పోవటానికి ధైర్యం చాలలేదు. ఈ రోజు తన ప్రథమ ప్రయత్నమిలా విఫలమైపోయింది. ప్రొద్దున్నే లేవగానే తానెవరి మొహం చూశాడో గుర్తురాలేదు రామారావుకు. బహుశా రాత్రి చదువుతూ ప్రక్కమీద అలాగే వదిలేసిన 'అర్ధరాత్రి అయిదున్నర హత్యలు' టైటిలుమీద తన అభిమాన డిటెక్టివ్ వేణు టెక్నికలర్ మొహాన్ని కాదుగదా! అని అనుమానించసాగాడు రామారావు

ఇలా ఆలోచిస్తూ రామారావు ప్రక్కనున్న కిళ్ళీషాపుకు పోయి సోడా త్రాగి చిల్లరకోసం జేబులో చేయి పెట్టాడు. చిల్లరతోపాటు పొడవాటి వస్తువేదో చేతికి చల్లగా తగిలింది. ఏమిటా? అని బయటికి తీసిచూశాడు. అది సైకిలు తాళం చెవి.

రామారావు తొందర తొందరగా బుక్ స్టాల్ కు పోయాడు ఖాళీగా ఉన్న బుక్ స్టాల్ వరండా చూడగానే రామారావు గుండెల్లో మరో అయిదు అణుబాంబులు ఒక్కసారిగా ప్రేలిపోయాయి. ఆదుర్దాగా బుక్ స్టాల్ లోకి పోయాడు "అనేకమంది వస్తూపోతూ ఉంటారు ఏది ఎవరిదో మేమెలా కనిపెట్టగలమండీ?" అని మర్యాదగా జవాబిచ్చాడు బుక్ స్టాల్ మేనేజరు.

రామారావుకు ఏం చేయటానికీ, పాలుపోలేదు ప్రఖ్యాత డిటెక్టివ్ రామారావు సరికొత్త 'ర్యాలీ' సైకిలును పట్టపగలే మారు తాళంతో హత్యచేసిన వాడెంత సాహసుడై ఉండాలి? వాడి గుండెలు దేనితో తయారై ఉండాలి?

ఇలా ఆలోచిస్తున్న రామారావు బుర్రలో హఠాత్తుగా ఒక మెరుపు మెరిసింది జేబులోంచి నోట్ బుక్ తీసి జాగ్రత్తగా పరిశీలించాడు. అతని కళ్ళు విజయ గర్వంతో మెరిశాయి నిల్చున్న పాళంగా పరుగు పుచ్చుకున్నాడు డిటెక్టివ్ రామారావు పోలీసు స్టేషనులో తన సైకిలు నెంబర్ని రిపోర్టు చేసేందుకు!. ★

# సినిమా

## ప్రభుత్వ సహాయం ఎవరికి చెందాలి?

**50** లక్షల రూపాయలతో ప్రభుత్వం నెలకొల్పనున్న ఫిలిం ఫైనాన్సు కార్పొరేషన్ గురించి బొంబాయిలో నిర్మాతలు పరిపరివిధాల చర్చించుకుంటున్నారు. ప్రభుత్వ బహుమతులు సంపాదించుకున్న నిర్మాతలంతా, ఈ కార్పొరేషన్ ముఖ్యంగా తమవంటివారికే సహాయం చెయ్యాలంటున్నారు. "మంచి చిత్రం" అన్నది తామే తయారుచేసినట్లు ఋజువైంది కాబట్టి ఆదేదో తమకే చెందాలని వారి వాదం.

కాదు కాదు వీలు లేదు అనే రెండవ పక్షంవారి వాదం ఏమిటంటే, ఈ సహాయం అనేది, పదిరోజులు నడచి పదిరాళ్లు చేసుకోగల చిత్రాలకి చెందినపుడే ప్రయోజనం ఉంటుందని.

"బహుమతులు తెచ్చుకున్న చిత్రాలన్నీ బాక్సాఫీస్‌కు అనుకూలాలై ఉన్నాయి. నిర్మాతలకు నష్టం కలిగిస్తున్నాయి" అని వీరు వాదిస్తున్నారు.

ఇందువల్ల, డబ్బు చేసుకోలేని చిత్రాలు నిర్మించడంలో సిద్ధహస్తులుగా ప్రసిద్ధికెక్కినవారికి ఈ సహాయం లభ్యం కారాదని వ్యాపారదక్షత కలిగి, విజయవంతం కాగల చిత్రాలను, ప్రజానీకానికి నచ్చే వాటిని నిరంతరం నిర్మించగలిగేవారిని ఆదుకొని ప్రోత్సహించడానికే ఈ సంస్థ పని చేయాలనీ వీరు నమ్ముతున్నారు.

ఈ వాదప్రతివాదుల సంగతి ఇలా ఉండగా, "సంశయవాదులు" యథాప్రకారం సామెతలు వల్లిస్తూ సందేహాలు వెళ్లబుచ్చుతూనే ఉన్నారు. తీరా ఈ కార్పొరేషన్ ఏర్పడ్డాక, మామూలుగానే అభిమానాలూ, ఆశ్రితపక్షపాతాలూ రాజ్యం ఏలుతాయనీ, దీనివల్ల జరిగే పని అమోఘంగా బోలెడు ఉండబోదనీ అంటున్నారు.

## బొంబాయి సినిమా లేఖ

సినిమాకి వచ్చినవాళ్ళకి వినోదం సమకూర్చడంతో పాటు, కాస్త తెలివి చేసుకుని, పౌరధర్మాలను, ఆరోగ్యసూత్రాలనూ చూచాయగానైనా బోధపరచే దృశ్యాలు చూపించవలసిందని బొంబాయి పురపాలక సంఘం ఇక్కడి చలనచిత్ర నిర్మాతలందరికీ విజ్ఞప్తి చేసింది. దీనికి బి. ఆర్. చోప్రా తీసిన "ఏక్-హీ-రాస్తా" చిత్రాన్ని వినతిపత్రంలో ఉదాహరణగా పేర్కొంది. ఆ చిత్రంలో, బాలనటుడు రూప్‌కుమార్, అపరిశుభ్రమైనచోట మిఠాయి కొనుక్కు తింటూవుంటే తత్ఫలితంగా ఆ పిల్లవాడికి కడుపునొప్పి వచ్చాయి. ఈరకంగా ఆరోగ్యసూత్రాలు, అవి పాటించకపోతే వచ్చిపడే ప్రమాదాలూ, మొదలైనవి చూపడం ద్వారా అనేక పౌరసమస్యలను పరిష్కరించవలసిన ఆవశ్యకత, అందుకు అనుసరించతగిన పద్ధతులూ ప్రేక్షకులకు తెలియ చెప్పవచ్చునంటుందని కార్పొరేషన్ వివరించింది. దీనికి చాలామంది నిర్మాతలు అంగీకారం తెలుపడం ముదావహం.

### "బొంబే నెం. 1"

"న్యూఢిల్లీ" చిత్రం విడుదలకావడంతో వైజయంతిమాల కీర్తి ఇనుమడించింది. ఈనాడు ఈమెను "బొంబే నెంబర్ వన్" అంటున్నారు.

బి. ఆర్. చోప్రా తన కొత్తచిత్రం "నయాదౌర్"లో ఈ మధ్యనే మధుబాలను తొలగించి వైజయంతిమాలను తీసుకోవడం తెలిసిన విషయమే. ఇందులో దిలీప్‌కుమార్ నాయకుడు. కమ్యూనిటీ ప్రాజెక్టులను ఆలంబనం చేసుకొని, "నయాదౌర్" చిత్రానికి కథ వ్రాశారు. "లొకేషన్ షూటింగ్" కోసం అని నయాదౌర్ యూనిట్, దిలీప్, వైజయంతిమాల ప్రభృతులు మొన్న భోపాల్ రాష్ట్రంలోని కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలకు బయల్దేరివెళ్ళారు.

### మరొక మద్రాసు తార

బొంబాయిరంగంలో మంచిపేరు తెచ్చుకొంటున్న మరొక దక్షిణ భారత నాట్యతార పద్మిని. ఇక్కడీమె ప్రస్తుతం రెండు చిత్రాలలో పాల్గొంటున్నది. ఇవికాక, ఎస్. ఎస్. వాసన్ నిర్మించనున్న మరో హిందీచిత్రంలో ఉంది. పద్మిని పాల్గొన్న తమిళచిత్రం "అమరదీపం" (తెలుగులో 'అమరజీవి')ని హిందీలో పునర్నిర్మించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. అందులో ఈమె దేవానంద్‌తో కలసి నటించనునుకుంటున్నారు.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



"భాగ్యరేఖ" లో జమున, బేబీశశి.

★

సెప్టెంబరు 28న లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి "ఇలవేలుపు" గుంటూరులో శతదినోత్సవాలు జరుపుకుంది. ఈ ఉత్సవంలో పాల్గొన్న నటీనటులు

★



చలన చిత్ర కథ

# బెడిసికొట్టిన పగ

ఆరు మాసాలపాటు. నిలచినచోట నిలవకుండా, చేతి బిడ్డతో నిరంతరం పారిపోతున్నట్లు తిరిగిన జీనీ, ఒక రోజున, తన భర్త స్టీఫెన్‌కు 19 ఏళ్లు శిక్ష పడిందని పత్రికలో వార్త పడిన రోజున, అమ్మయ్య అని ఆయాసం తీర్చుకుని స్తిమితపడింది. గుండె మీద రాయి దిగినట్లయింది.

* * *

19 సంవత్సరాలూ గిర్రున తిరిగాయి. మళ్ళా ఆ రోజున—చికాగో నగరంలో స్టీఫెన్ విడుదల అయే రోజున ఆమెకి మళ్లీ గుండెల్లో రాయి పడింది. స్టీఫెన్ తనని చంపుతాడని భయం పట్టుకుంది. ఈ పంథొమ్మిదేళ్లలోను జీనీ తన జీవితాన్ని ప్రశాంతంగా సాఫీగా సాగించింది. న్యూమెక్సికోలో కౌంసిల్ టౌన్ పట్టణంలో ఒక చిన్న పత్రిక పెట్టి నడిపింది. అక్కడ ఆమె పేరు జీనీ కాదు. క్రిస్టల్ బెన్సన్.

నాలుగు డబ్బులు చేసుకుంది. స్థిరపడి, మంచిపేరు తెచ్చుకుంది. ఒక్కగానొక్క కూతురు రాండీని అల్లారుముద్దుగా పెంచుకుంటోంది. హ్యారీ అనే యువకుడికిచ్చి పెళ్ళిచేయ దలచింది.

మృత్యుదేవత వంటి తన మాజీభర్త స్టీఫెన్ తిరుగుతున్నాడని పసిగట్టిన క్రిస్ బెన్‌సన్, ముందు జాగ్రత్తపడింది. తన కూతురు భవిష్యత్తుని, నాలుగు వేల డాలర్లనీ, హ్యారీకి రహస్యంగా ఒప్పగించింది. ఊళ్లో షరీఫ్‌ని అడిగి, ఒక పిస్తోలు తెచ్చి తన పడక మంచంపక్క ఇనప్పెట్టిలో దాచుకుంది.

తన భయం సంగతి ఎవరికీ చెప్ప సాహసించ లేదు. క్రిస్టల్ బెన్సన్. ఆఖరుకు తాను ప్రేమించి పెళ్ళాడదలచిన జార్జితో కూడా. జార్జి అక్కడ భూగర్భవస్తుశాఖ ఇంజనీరు. రెడ్ ఇండియన్లు పూర్వం కట్టిన ఇళ్ల శిథిలాలకోసం త్రవ్వకాలు సాగిస్తున్నాడు. "క్రిస్! మన పెళ్ళి ఎప్పుడు?" అంటాడు జార్జి. ఇప్పుడు కాదులే అనేది క్రిస్టల్.

* * *

మృత్యుదేవత హఠాత్తుగా ఒక రోజున వచ్చి ఊళ్లో దిగింది. దాని పేరు స్టీఫెన్. అతడు పూర్వం క్రిస్టల్ భర్త. 17 ఏళ్ళ వయసులో ఈమె అతణ్ణి ప్రేమించి, తల్లితో పోట్లాడి మరీ పెళ్లి చేసుకుంది. కొద్దిరోజుల్లోనే స్టీవ్ పెద్దగాలిడీ ముఠానాయకుడని తెలిసింది. ఒకరోజున ఒక ఖూనీవ్యవహారంలో అతడు హీరో భూమిక నిర్వహించాడని బయటపడింది. ఈమె పోట్లాడింది. అతను బుకాయించాడు తరవాత హింసించి నోరు మూయబోయాడు.

ఆమె పారిపోయింది. ఎవరికీ తన జాడ తెలియకుండా పారిపోయింది.

అదికూడా స్టీఫెన్ మెడకి ఉచ్చు అయింది. అతనే ఆమెను చంపాడని ఆరోపణ చేయబడింది. 19 సంవత్సరాలు జైలులో వేశారు. ఈ సుదీర్ఘ కాలంలో స్టీఫెన్ చేసినపని ఒకటే. పారిపోయిన తన భార్యను ఎలాగైనా పట్టుకొని చిత్రవధ చెయ్యాలని పగపట్టి, దానికి పద్ధతులు ఆలోచించడం. ఆమే కావాలని ఇలా చేయించిందని అతనికి అనుమానం.

స్టీఫెన్ విడుదల అయ్యాక ఇందుకు ఉపక్రమించాడు. ఒకరోజున పత్రికలో ఒక బొమ్మ పడింది. అచ్చు తన భార్య పోలికే. తన భార్య పారిపోయినపుడు గర్భవతి. ఈ పిల్ల తన కుమార్తె అని నమ్మకం కుదిరింది. స్టీఫెన్ కౌంసిల్ టౌను వచ్చాడు. తన భార్య కొత్తపేరు క్రిస్టల్ బెన్సన్ అని తెలుసుకున్నాడు. ఆమెను కలుసుకున్నాడు. నిస్సంకోచంగా, నిర్దాక్షిణ్యంగా, తాను పగతీర్చుకోదలచిన విధాన్ని టెక్నికలర్‌లో వర్ణించి చెప్పాడు.

స్టీవ్ తనకి అన్నయ్య అవుతాడని తాత్కాలికంగా ఊళ్లో అబద్ధాలు చెప్పి సర్దివేసింది.

స్టీవ్ ఈ అలుసు చూసుకుని, చొరవగా ఆమె వ్యాపారంలో కలుగ చేసుకుని డబ్బంతా ఊడ్చి జాగర్త చేశాడు. కల్లబొల్లి కబురు చెప్పి, క్రిస్ కుమార్తె రాండీని చికాగో ప్రయాణమై రావడానికి ఒప్పించాడు. పిల్లతో తల్లీ వస్తుంది. తల్లిని చంపెయ్యవచ్చు. ఏదో ప్రమాదం జరిగిందని కథ పుట్టించవచ్చు. అసలు క్రైము ఉండదు కూడా ఎందుకంటే, 19 ఏళ్ల క్రితం, చట్టరీత్యా ఈ క్రిస్ అనే ఆవిడ, పూర్వాశ్రమంలో జీనీ అనే అమ్మాయి హత్యచేయబడినట్టు దాఖలాలు ఉన్నాయి కాబట్టి, తను చేయబోయే హత్య రచ్చకెక్కదు. ఇదీ స్టీఫెన్ పథకం.

ఇంక, క్రిస్‌కి ఈ గొడవ లేదు. ఈ పట్నం నించి మెక్సికో పారిపోవాలని పథకం వేసుకుంది. ఒకరోజు రాత్రి ముహూర్తం పెట్టుకుని, విమానంలో సీటు బుక్ చేసుకుంది.

ఆ రోజు రాత్రే స్టీఫెన్‌కి కొత్త సంగతి తెలిసింది. క్రిస్‌ని పిలిపించాడు. నువ్వు ఇలు తాకట్టుపెట్టి తెచ్చిన నాలుగు వేల డాలర్లూ ఇచ్చేయి అన్నాడు.

సరే తెస్తాను ఉండు అంది క్రిస్, అలా చెప్పి పారిపోదామన్న ఊహతో. అంతవసీ

# ఫాబ్యులస్ సెన్యోరిటా

## * పి. భానుమతి *

కోకిలపాటని అందరూ ఎందుకు బాగుందంటారు?

కోకిలకు మంచి కంఠం ఉంది. పాటలో సొగసు ఉంది.

కోకిలకు ఆ కంఠాన్ని దేముడిచ్చాడు.

*   *   *

ముప్ఫైఏళ్ల క్రితం ఒకరోజున ఒంగోలులో ఒక అమ్మాయికి కూడా దేవుడు ఇలాటివరం ఇచ్చాడు. అందుకని ఆ అమ్మాయి, హాయిగా పాడేది. ఆ పిల్ల పేరు భానుమతి.

*   *   *

"ఈపాట దేశంఅంతా విని ఉంటే ఎంత బాగుండేది! అనేవారు మానాన్న" అంది ఆఅమ్మాయి.

ఆ అమ్మాయి పేరు బొమ్మరాజు భానుమతి.

*   *   *

పదిహేనేళ్ల క్రితం ఒక కొత్త పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ, మధుపర్కాలు కట్టుకుని, ఒక ఇంటికి వెళ్ళి తలుపుకొట్టారు. తలుపు తీసిన ఆయనకి పాదాభివందనం చేశారు దంపతులు.

"నాన్నా మమ్మల్ని దీవించు." అంది పెళ్లికూతురు.

నాన్నగారు విస్తుపోయారు.

"నాన్నా! నాకూ, దేవుడికీ, జాతకానికీ నచ్చిన అబ్బాయి నీకు నచ్చలేదు. అయినా నీలో ఉండే ఆత్మవిశ్వాసం, పట్టుదల, నీ కుమార్తెనైన నాకూ అణువణువునా కంటపట్టాయి. అందుకని స్వతంత్రించి పెళ్లిచేసుకున్న మమ్మల్ని మనసారా దీవించు" అంది పెళ్లికూతురు.

ఆ పెళ్లికూతురు పేరు శ్రీమతి పాలువాయి భానుమతి. ఆయన పేరు శ్రీ రామకృష్ణ.

*   *   *

"మీకు చాలా పొగరు అంటారు."

"నామీద నాకున్న నమ్మకాన్ని గౌరవాన్ని అహంకారం అనేవాళ్ళకీ, మోసపు చెప్పే మోహమాటం, వికారపు వినయం అభినయించడానికి ఇష్టంలేక, నేను నిష్కర్షగా అనే మాటలని విని, తలపొగరు అని విమర్శించేవాళ్లకీ నేను చెప్పగలిగేదేం లేదు" అన్నారామె.



ఆమె నటి, గాయని, దర్శకురాలు, సంగీత దర్శకురాలు, అయిన బహుముఖ ప్రజ్ఞావతి భానుమతి.

*   *   *

"నాచిన్నప్పుడు నేను ఎన్నడూ పెద్ద సినిమా స్టార్ ని అవాలని ఆశపడలేదు. కలగ పెట్టుకోలేదు. దేముళ్ళకి మొక్కుకోలేదు. అసలు ఈవిషయంలో అప్పుడూ ఇప్పుడూ కూడా ఇంతే. నేను దేముడికి నమస్కారం పెడతానుగాని ఆశ పెట్టను. అలాగే, శివుణ్ణి చూడడానికి పనిగట్టుకు కాశీవెళ్ళాలని పట్టింపు లేదు. ఆయన ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎవరికైనా ఉంటాడు. నేనిక్కడ్నించి నమస్కారం పెట్టగలను; ఆయన అందుకోనూగలడు" అంది భానుమతి.

భానుమతి చిన్నతనంరోజుల్లో ఆడపిల్ల సినిమాల్లో చేరడం అంటే "అమ్మో! ఇంకేమైనా ఉందా" అని జనం బుగ్గలు నొక్కుకునేవారు

"నేనూ అలాగే అనుకునేదాన్ని" అంది భానుమతి నవ్వుతూ

తల్లిదండ్రులచాటున, నాలుగు గోడల మధ్య భయభక్తులతో పెరిగిన పిల్ల సంప్రదాయాన్ని పెద్దల ఆచారాలను గౌరవించి మన్నించడం నేర్చుకున్న అమ్మాయి

వాళ్ళనాన్నగారు సంగీత విద్వాంసులు. తనలో తను సన్నగా మెత్తగా పాడుకునే భానుమతి కంఠంలో ఆయనకు మంచి భవిష్యత్తు కనబడింది కొంతలో ఆయన విన్నది, కుమార్తె పాటకాదు "ఆపిల్ల చాలా చక్కగా పాడుతుంది" అని వాళ్లూ వీళ్లూ మెచ్చుకుంటూ అన్నమాటలు స్వయంగా పాట కూడా విన్నాక, వెంకటసుబ్బయ్యగారు కుమార్తె విషయంలో ప్రత్యేకశ్రద్ధవహించి సంగీతం చెప్పడం మొదలుపెట్టారు. ఆమె పాట దేశమంతా వినాలని ఆయన సంకల్పించారు

పధ్నాలుగోఏటనో, పదిహేనోఏటనో, ఆమెకి "వరవిక్రయం" లో నటించడానికి అవకాశం వచ్చింది

"పెళ్లికానిపిల్ల వేషమే" అని చెప్పారు అడుగవచ్చిన దర్శకుడు శ్రీ పి పుల్లయ్య

వెంకటసుబ్బయ్యగారు, ఆలోచిస్తున్నారు అప్పటికి మర్నాటినించి ఇంట్లో భానుమతి భవిష్యత్తుమీద వాదప్రతివాదాలు జరిగాయి అన్నయ్యలు వద్దన్నారు. శ్రేయోభిలాషులుకొందరు "శ్రేయస్కరం" అన్నారు మరికొందరు "అప్రతిష్ట ముచ్చట" అన్నారు అమ్మ సందేహించింది నాన్న తటపటాయించారు

"నాన్న చెప్పినట్టు వినడం నామతం. అందుకని నేనేమీ అనలేదు; అనుకోలేదు. తలవంచుకున్నాను" అంది భానుమతి

అలా తలవంచుకుని ఉండడం ఆమెకి అల వాటు "వరవిక్రయం" లో నటిస్తున్నప్పుడు సెట్సుమీదకూడా అంతే కెమెరాస్వరూపం ఎలాఉంటుందో కొన్నాళ్లవరకూ తెలీసింది కాదామెకి

అందరూ పోలికచేసేవారు ఆడేమిటలా గొర్రెలా తలవంచుకు నిలబడతాదని

"మా చెల్లెళ్ళు నాకు 'గొర్రె' అని పేరుకూడా పెట్టారు నాకు...ఇప్పుడూ

"పెళ్లి తప్పలేదు. పెంకిఘటం అంటారంతా" అంది భానుమతి పకపకనవ్వుతూ.

* * *

చలనచిత్రసీమలో ప్రవేశం ఈ విధంగా జరిగింది.

"టంగుటూరి వారమ్మాయి (శ్రీమతి సూర్యకుమారి) చేరలేదా ఏమిటి? నా కూతుర్ని చేర్పిస్తాను" అన్నారు వెంకటసుబ్బయ్యగారు ఆ నిర్ణయం చేసిన రోజున.

* * *

ఫిలింస్టార్ కావాలన్న ఉబలాటంతో బయల్దేరలేదు కాబట్టి, అయినరోజున అయావని చోలేదు మురిసిపోలేదు. గర్వంతో విర్రవీగనూలేదు. పెద్దలుకూడా, ఆమెని అన్నలకన్న, చెల్లెళ్లకన్న మిన్నగా, 'స్పెషల్'గా పెంచలేదు. అందరిమల్లేనే భయభక్తులలో క్రమశిక్షణతో పెంచి పెద్దచేశారు.

ఇల్లూ, అన్నా చెల్లెళ్లూ, అమ్మా నాన్నా, సంగీతం తప్ప ప్రపంచం ఏమిటో తెలియని పద్నాలుగేళ్ల భానుమతికి, అసలు ఆ ధ్యాసే ఉండేదికాదు. ఆమెకి బొమ్మల పెళ్లిళ్ళు చెయ్యడంఅంటే ఎంతో సరదా. తాటాకుబొమ్మలూ, కొండపల్లి బొమ్మలూ బోలెడు పోగుచేసుకునేది. వాటితోటే ఆడుకొనేది. చిన్నప్పుడు, ఆమె ఆశలూ కలలూ కూడా బొమ్మలపెళ్ళిళ్ల పంథాలోనే ఉండేవి.

"ఎన్ని వందలు బొమ్మల పెళ్ళిళ్లు చేశానో" అంది భానుమతి, ఆలోచిస్తూ, ఎన్ని వందలో అంచనా వేయ ప్రయత్నిస్తూ. ఇప్పటికీ అంతే. బొమ్మలంటే ఎంతో ఇష్టం. ఏటా బొమ్మలకొలువు పెడుతుంది ఎన్ని పనులున్నా.

"ఆయన నవ్వుతారు. ఇన్ని పనులుంటాంటే, చిన్న పిల్లలా ఇంకా బొమ్మలతో ఆటలేమిటి? అంటారు" అంటుందామె.

అందువల్ల నిత్యం తాటాకుబొమ్మలు కట్టడంలో, వాటికి అలంకారాలు చేయడంలో నిమగ్నయైన భానుమతికి, మరో గొడవ ఉండేదికాదు. ఎన్నడూ ఆమె తల్లిదండ్రులమాట జవదాటలేదు. కాదనలేదు. కాదన్నదల్లా ఒక్కసారే. అది ఆమె వివాహం విషయంలో.

"అది చిత్రమైన కథ. నాకు పవిత్రమైన కథ..." అన్నది భానుమతి.

"కృష్ణప్రేమ" చిత్రం తయారవుతున్న రోజుల్లో భానుమతి తొలిసారిగా రామకృష్ణను చూసింది. ఆయన ఆ చిత్రానికి సహాయదర్శకుడు. ఆయనకి ఎంతసేపూ తన పనేమిటో తన లోకమేమిటో. మంచివాడు. ఆ మాటనే అందరూ, అస్తమానం చెప్పుకునేవారు. అప్పుడూ ఇప్పుడూకూడా అంతే.



ఆంధ్ర ప్రభుత్వం అక్టోబరు 1 న భానుమతిని సన్మానించింది.

ఈ మంచివాడు మంచివాడు అన్న సర్టిఫికెట్ పదహారేళ్ళ భానుమతిని ఆకర్షించింది. క్రమంగా ఆయనమీద గౌరవభావం ఏర్పడింది. ప్రేమ అనవచ్చు, అభిమానం, అనురాగం అనవచ్చు. ఏమయితేనేం, ఈ అమ్మాయి తనకి తెలియకుండా ఆ అబ్బాయిని ఆరాధించసాగింది. ఈ కృష్ణప్రేమ సంగతి రామకృష్ణకి అంతకన్న తెలియదు.

ఈ సంగతి పసిగట్టినది, పసిగట్టుటే కనిపెట్టినది భానుమతి చెల్లెలు.

"ఔను కాని అక్కా. ఒక్క సంగతి అడుగుతాను చెప్తావా?" అంది ఒకనాడు. భానుమతి చెప్పమంది.

"నీకు తెలుసునో లేదో నాకు తెలీదు గాని, సెట్సుమీద నువ్వెప్పుడూ ఆ అబ్బాయివేపే చూస్తూఉంటావు" అంది చెల్లెలు.

ఈ మాట నిజమైనా, భానుమతికి ఈ వైనం తెలీదు.

ఆ సంగతే చెప్పింది చెల్లెలికి.

"పోనీ. నాకు తెలుసు. నేను రోజూ చూస్తునేఉన్నా. దొంగ దొరికింది" అందా అమ్మాయి నవ్వుతూ.

భానుమతికికూడా తనలో ఉన్న దొంగ ఆ రోజునే దొరికింది. భానుమతి ఆదొంగని ఎక్కడికీ పారిపోనివ్వలేదు. అలా అని ఆ సంగతి ఎవరికీ చెప్పనూలేదు — రామకృష్ణకి కూడా.

"కాని ఎన్నాళ్లు?...చివరకి ఒక రోజున అమ్మకి చెప్పాను. అమ్మ నాన్నకి చెప్పింది. నాన్న వద్దన్నారు. నేను ఔనన్నాను. అమ్మా నాన్నా కాదన్నారు. అమ్మ చెప్పిన కారణం: "ఆయనకి ఆస్తి లేదు" నాన్న అభిప్రాయం, పోనీ పెర్సనాలిటీ ఉండాలి కదా? అని. నేను? నే నేమనుకున్నట్లు?... నే నేమనుకున్నా, పెద్దవాళ్లు కాబట్టి ఆట్టే పట్టించుకోలేదు. చిన్నపిల్ల అన్నారు. మా నాన్నమీద పూర్తి గౌరవంతోనే చెప్తున్నాను. ఆయననేకాదు పెద్దవాళ్లు అంతా ఇంతే. సదసద్వివేకజ్ఞానం పిల్లలకు ఉంటుందని, వాళ్ళకి స్వంత అభిప్రాయాలూ, లక్ష్యాలూ ఉంటాయనీ...చటుక్కున ఒప్పుకోరు... నేను అప్పటికి ఊరుకున్నాను" అంది భానుమతి.

అప్పటికి వాళ్ళ నాన్నగారు ఊర్లో లేరు. రామకృష్ణగారి తల్లిదండ్రులతో ఈ విషయం ప్రస్తావించారు. వాళ్ళకి పెద్ద ఆస్తి ఏమీ లేదు. "మా అబ్బాయి చాలా మంచివాడు. బుద్ధిమంతుడు" అన్నారు మామగారు సగర్వంగా.

ఇది జరిగే వరకూ రామకృష్ణకి ఈ విషయం ఏమీ తెలియదు. డైరెక్టరుగా పని నేర్చుకుంటున్న తను, ఒక కథకి హీరో అన్న వైనం ఏమీ తెలియదు. వెంకటసుబ్బయ్యగారికి తోచిన

కారణాలవల్లనే అప్పటివరకూ ఆయన దృష్టి కూడా భానుమతి వంకకు వెళ్ళలేదు.

వేరే సంబంధాలు చూస్తామన్నారు వెంకటసుబ్బయ్యగారు. తొలిసారిగా ఒకరి మీద గురి, గౌరవం, అభిమానం కుదిరిన తరువాత, ఏ ఆడపిల్లకైనా మనసు మారదు. భానుమతికి మారలేదు.

పెద్దలు నాడే జాతకాన్ని తిరగేయించారు. బహు యోగ్యుడు, సౌమ్యుడు ఆమెకు భర్త కాగలడని ఆజాతకం ద్యోతకం చేసింది.

భానుమతి ఓర్పుతో రోజులు గడప సాగింది. కృష్ణప్రేమ చిత్రం పూర్తి కావడానికి రెండేళ్లుపట్టింది. భానుమతి లక్ష్యం ఫలించడానికి ఎనిమిది నెలలు పట్టింది. ఈలోగా ప్రాణం విసుగెత్తిందికూడా. ఒక రోజున, స్టార్ కంబైన్స అధిపతి శ్రీ రామయ్యగారి భార్య శ్రీమతి కణ్ణామణికి ఈ సంగతి చూచాయగా తెలిసి, భానుమతిని చేరదీసి లాలనగా అడిగింది. భానుమతి మనసు విప్పి చెప్పింది. ఆపెన ఆమె రామకృష్ణకు కబురంపి అడిగింది ఆయనకూడా దాపరికంలేకుండా సమాధానం చెప్పారు.

* * *

కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని ఆరోక్తి. మ రేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అని 'ఆంగ్లోక్తి.'

రావలసిన కల్యాణ ఘడియలు వచ్చాయి. అవి రావడానికి రెండు ఘడియలు ముందుగా, భానుమతికి, ఒక శ్రేయోభిలాషి ఇంటినుండి ఒకసారి రమ్మని కబురు వచ్చింది. అలాగే రామకృష్ణకీను.

ఇద్దరూ అక్కడికివెళ్లాక, "మీ కిప్పుడు పెళ్ళి" అన్నారు ఆ పిలువనంపిన కుటుంబంలోవారంతా చుటూచేరి

"మానాన్నకి చెప్పొద్దూ" అంది భానుమతి విస్తుబోయి. అలాగే చెబుదాంఅన్నారు వారు. "అసలేమిటీ...ఇలా హఠాత్తుగా ముహూర్తం ఏమిటి?" అన్నాడు రామకృష్ణ విస్తుబోయి "అది అంతేలే ఘటన" అన్నారు వారు.

జార్జిటౌన్‌లోని ఒక దేవాలయంలో ఈశ్వర సమక్షాన, శుభముహూర్తాన శాస్త్రోక్తంగా, సలక్షణంగా, అయితే నిరాడంబరంగా వివాహం జరిగింది.

వధువు తల్లితండ్రులూ, వరుడి తలిదండ్రులూమాత్రం ఆక్షణాన అక్కడలేరు. అయితే, పెళ్ళిఅయిన ఉత్తరక్షణాన, వధూవరులు మధుపర్కాలతో, సరాసరి నాలుగు వీధుల అతిలవున్న భానుమతి ఇంటికివెళ్ళి వందనం చేశారు. "నాన్నా, మమ్మల్ని దీవించు" అంది భానుమతి

"నీకింత పట్టుదలఅయితే, నేనుమాత్రం అపేవాణ్ణాతల్లీ కన్యాదానం అన్యులు చేయవలసి వచ్చింది" అన్నారు వెంకటసుబ్బయ్యగారు కంటతడిపెట్టి.

"నాన్నా నీపట్టుదల, నీ ఆత్మవిశ్వాసం నాలోనూ ఉన్నాయి అందుకే ఇలా స్వతంత్రించాను. దీవించు నాన్నా" అన్నది భానుమతి, ఆయన మనసారా దీవించారు.

* * *

"ఒకరోజున ఆయన పెట్టిన విద్యాభిక్ష, ఆరోజున ఆయన దీవెన నా పురోభివృద్ధికి పునాదిరాళ్లు" అన్నది భానుమతి తన పెళ్లినాటి ముచ్చట చెబుతూ పెళ్లి అయిన నాటికి ఆమె "గరుడగర్వభంగం" చిత్రంలో నటిస్తోంది. తరవాత ఆమె కొంతకాలం చిత్రసీమనుండి విరమించుకుంది. మాంబళంలో బొమ్మరిలులాటి చక్కనిఇల్లు పదిహేను రూపాయల బాడుగకి తీసుకున్నారు; కాపురంపెట్టిన నవదంపతులు.

* * *

భారత భాగవతాలు చదువుకున్నది భానుమతి సంప్రదాయాలను గౌరవిస్తుంది. మన్నిస్తుంది శాస్త్రీయ సంగీతం అంటే ఆమెకు అభిమానం గౌరవం ఒకప్పుడు వాళ్ళ నాన్నగారికి మాట ఇచ్చింది తను తీసే ప్రతిచిత్రంలోను, శాస్త్రీయ సంగీతానికి స్థానం ఉంటుందని, తను ఒక్క కీర్తన అయినా పాడుతుందనీను ఇతరుల చిత్రాలలో తాను పాల్గొన్నపుడు సర్వదా ఈమాట నిలబెట్టుకొనకపోయినా, తాను నిర్మించే ప్రతిచిత్రంలో సంప్రదాయానుగుణమైన సంగీతంవుంటుంది. ఆమె ఒక్క కీర్తన గాని, వరంగాని పాడుతుంది. హాస్యరస ప్రధాన చిత్రం "చక్రపాణి"కి ప్రారంభ సంగీతం కదన కుతూహల రాగంలోని కీర్తన "రఘువంశ సుధాంబుధి " ఇప్పుడు రిపబ్లిక్ పిక్చర్స (అమెరికా) వారి ఫాబ్యులస్ సెన్యోరిటా (సెనొరిటా) ఆధారంగా ఈమె నిర్మిస్తున్న "వరుడు కావాలి" అనే చిత్రంలో కూడా ఒక త్యాగరాజకృతి పాడుతోంది

కళారాధకురాలుగా ఆమె స్వేచ్ఛనీ, ప్రశంసనీ అపేక్షిస్తుంది ఈసంగతి ధీమాగా చెబుతుంది వీటికల మనస్సుకి ఆనందం, ఉత్సాహం కలుగుతాయి అంటుంది.

పక్షిరాజావారి "అగ్గిరాముడు, మలైకళ్లన్" చిత్రాలు తయారవుతున్న సమయంలో, అవసరాన్ని బట్టి, భానుమతి సరిగా ఇరవైనాలుగు గంటలలో ఆరు పాటలు రికార్డు చేసింది. ఒక నిమిషం కాలం, ఒక అడుగు సెల్యులాయిడ్ వృధాగా పోకుండా.

"నేను పాడడానికీ, నటించడానికీ ప్రత్యేకం కష్టపడి ప్రయత్నం ఏమీ చెయ్యను. నా కృషి ఫలితం బాగుంటుందని నామీద నాకు నమ్మకం ఉంది. ఇలా చెప్పడానికి నాకు జంకేమీ లేదు ఫాల్స డిగ్నిటీ, లాగే ఫాల్స మాడెస్టీకూడా నాకు నచ్చదు. నాకు మంచివని తోచిన పద్ధతులలోనే, మా అబ్బాయి 'భరణి'ని కూడా పెంచుతున్నాను," అంటుంది భానుమతి

భానుమతి ఇప్పటికి దాదాపు, 60 చిత్రాలలో (తెలుగు, తమిళం, కన్నడం, హిందీ) నటించింది ఇపుడు ఆమె నటిస్తున్నవి దాదాపు 20 చిత్రాలు.

ఆంధ్ర ప్రభుత్వం, అక్టోబరు 1 న, ఆంధ్ర రాష్ట్ర తృతీయ వార్షికోత్సవ సందర్భంలో శ్రీమతి భానుమతిని సన్మానించారు. ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad.